[విద్యానిధి ప్రవేశం]

విద్యా—

ఉ. చాటునఁజేరి ముష్కరులు చాల వచింపఁగ సాహసింతురే
పాటిపివేకమద్ది ? ప్రతిభాగతిభాసురమైన సింహమె
చ్చోటనొ గర్జనల్ సలుపుచున్ గదలన్ వదరంగఁ జొచ్చి, యే
మాటునొ చేరియో పసికమాలిన కుక్కలు మొఱ్ఱుకై వడిన్.

అగ్రజుని నీవా దండించేది ?

బలు—(కోపంతో) దుష్టవర్తను శిక్షించుటనేమి ? సృష్టికర్తలయిన నేమి ? దుష్టత్వమున్నప్పుడు శిక్షార్హులే.

విద్యా— నీకీ శిక్షాధికార మెవరిచ్చారు ?

బలు—ఓహో ! తెల్లకాగితాన్ని నల్లకాగితం చేయఁగల మొనగాళ్లు.

[భేతాళభైరవులు గొలుసులు పట్టుకొనివచ్చి కలియఁబడి కట్టివేస్తారు]

బలు—మీకీ బలమెక్కడిది ?

భేతా—గల్లాపెట్టెలోది.

విద్యా—(కంటితో సంజ్ఞ చేయును)

భైర—(తలపై తన్ని) ఇక్కడిది.

బలు—తల్లీ ! విశ్వమాత ! (పడిపోవును)

(అందఱు కలసి పట్టుకొని పోదురు)

మోహి—ఇప్పటికి నాతంత్రాలన్నీ చాలా జయసూచకంగా కన్పట్టుచున్నై. ఇంకా అఖండకార్యఘటనాధురీణుఁడైన యీవిద్యానిధినిగూడా చెఱపెట్టాలి. అప్పుడుగాని నాసిగ ముడిపడదు. ఇతని మధుపానమత్తునిచేసి నాదగ్గఱ మైమఱచి పడివుండే సమయంలో ఇతణ్ణి బంధింపచేయాలి.

ఆవచ్చేదెవరు ? ఓహో ! ఈవెళ్ళినాఁడా ! ఇతఁ డెప్పుడు సమయం కనిపెట్టి నాదగ్గఱకు వచ్చుచుండుట కారణమేమో తెలుసుకొంటాను.

[తిక్క శాస్త్రి ప్రవేశం]

మోహి......దయచేయండి.

తిక్క— ఇంత తిప్పలుపడి వచ్చినప్పుడు తిన్నగా ముఖసందర్శన భాగ్యమైనా లభించకముందే దయచేయటమేనా ?

మోహి—కాదండి. కూర్చోండి.

తిక్క—అంతేకదా. బ్రతికిపోయినాలే. (కూర్చుంటాడు)

మోహి—ఎన్నఁడూ చూపయిన దయచూపని పెద్దలు నేఁటికి ఈదాసురాలిపై అనుగ్రహం కలిగివచ్చారా ?

తిక్క—దయ లేకపోవటమేమిటి ? నిజంగా నీమీద వున్న దయా, తీపి నాప్రాణాలపైన కూడా లేదంటే నమ్ము.

మోహి—అయితే ! మీవల్ల నుము తరించే దెప్పుడు ?

తిక్క—ఎప్పుడు పడితే అప్పుడు.

ఉ. పేరెమితోడ నీనయనవీధిని చక్కని ప్రేమసౌధ మిం
పారఁగఁ గట్టుకొంటి; తిరమై మృదువై మనదివ్యమైన సం
సారమె; అందు దైవకృప చల్లనివేళ గృహప్రవేశమై
కోరికదీర నా కుసుమకోమలగాత్రి ! సుఖించు టెన్నఁడో.

మోహి—(సిగ్గుతో దూరంగా నిలబడును)

తిక్క—జగదేకసుందరీ ! ఇంతసిగ్గెందుకు ?

చ. నిరతము పాయపాయలయి నీనునుసిగ్గులనిగ్గు లేరులై
వఱదలువట్టి, చుట్టునెటుపాదముమోపుటకైన వీలులే
నిరకముఁ జేయునేమొయనను; నిక్కముదానికిమాత్రమేను ని
ద్ధరణినినైపలేను సురదానవులడ్డినగూడ పొత్తిరో.

మోహ— వేదశాస్త్రపారంగతులయిన మీరు కాముని జయింపలేరా?

గీ. హంసతూలికా శయ్యలనంటియుండు
దివ్యతరమైన రారాజు దేహబలము
బూదిసేయుచుండిన రుద్రభూమినుండు
మన్మథాంతకుని స్తవమ్ము మానకయ్య.

తిక్క——అది అసాధ్యము.

గీ. నీదుప్రాణికి నాదుప్రాణికనయమ్ము
యీయెడ నెరపిలేక వర్షించుప్రణయ
వృష్టినిత్యముసేయు ప్రవీణుడెవడొ
మొక్కకొందము నూడుమో ముద్దులాడి.

మోహి——ఏమిటీవెఱ్ఱితనం ? ఉత్తమజ్ఞాన సంభూతుడవైన నీకిది తగునా ? సిగ్గులేదా ?

తిక్క——(లేచి) నీవేమన్ననూ నాచెవులకింపుగానే వుంటుంది.

గీ. ప్రేయసీ ! నీకిసీయని విసుగుపుట్ట
లేనిదోసగులకుంగూడ నేను దాసు
డనయి, నొప్పుకొందునుగాని, వినవె ! నాదు
కినుకకీవట్లు దాసివై కిసలయోష్ఠి.

మోహి——(ఆగ్రహంతో, ఛీ ! దుర్మార్గుడ ! నీముఖం చూడగూడదు (లోనికిపోయి తటాలున తల్పువేయును)

తిక్క——తలుపులావేసేది ? గట్టిగానా చెంపలా ? (అటు నిటు చూచి చూచి) దీని అంతు కనుక్కొందే పోగూడదు. (మోహిని తెర లోంచి, పోతావా పోవా ? బుద్ధి చెప్పించ మన్నావా ?)

తిక్క——ఎంతదానవే

సీ. నీ ప్రసూన లతికానిర్మలదేహ మం
దేమిగలదో సాధ్య మెపుడు గాదు
నీ నిగారపు హరిణేక్షణాశూల మం
దేవిసమంటునో యెఱుంగుచుంటి
నీ కులుకుతళ్కు-ల నీచిర్కు-గవు కెర
టాలలోగా లేమొ తెలకుంటి
నీ పల్కు- మం · ాకినీప్రవాతిలో సుడి
గుండములేవో మున్గులకు తాళ
గీ. లేక యుక్కిరిబిక్కిరై ికల బలి
యూాచునుంటినే! నామీాద యాశలేశ
మైన లేదని మొదటనే గానకుంటి
మర్మమున వన్నెలాడివే మాయలాడి.

ఇంకముందు నీగుమ్మం తొక్కవచ్చునా? కసాయి దుకాణం దగ్గఱ కాకులూ కుక్కలూ ముసరినట్లు నీ దుకాణందగ్గఱ కామోద్రేకులు ముసురుతారు. కసాయివాండెన్నిసార్లు కొట్టినసూసరే; రుచిమఱిగి తిరిగివస్తున్న కాకులూ, కుక్కలూమాదిరి నీవద్దకు విటులు వస్తుంటారు. (చూచి) అయితే; యిక్కడ రుచిమఱిగిన పురుగులేవో వస్తున్నట్లున్నె.

ఇది ప్రాణప్రమాదమైన ఘట్టమేనే. కానిమ్ము. (పై కొల్లాయి గుడ్డని జోలె చేసుకొని) సీతారామచంద్రపరబ్రహ్మణేనమః. అమ్మా! ఉపాదానబ్రాహ్మణ్ణి. ఇవాళ్ల దశమీా శుక్రవారం వర్జంలేదు.

[భేతాళ భైరవులు ప్రవేశింతురు]

భేతా—(పెద్దగా) ఎవడవురా నీవు?

తిక్క—(ఉలిక్కిపడును)

భైర—ఎందుకల్లా వులిక్కిపడి దొంగచూపులు చూస్తావ్?

తిక్క—ఉపాదానం అడుగుతున్నా బ్రాహ్మణ్ణి బాబు.

భేతా—ఇదివుపాదానం పెట్టు గుమ్మంకాదుపో.

తిక్క—చిత్తం. అల్లాగే (మెల్ల మెల్లగా బోతూ కాలుజారి పడినట్లు నటించి మాటలు వింటూవుంటాడు)

భేతా—ఇంకా విద్యానిధి భరతంపట్టాలి. తరువాత భరతసామ్రాజ్యమునకెల్లా మనం పట్టంకట్టుకోవాలి.

(తిక్కశాస్త్రి చెవులు మూసుకొని శ్రీహరీ శ్రీహరీ అనును)

భైర—అదేమిటి ఇక్కడ బాధపడుతావ్. పొమ్మంటును.

తిక్క—పోతున్నా బాబు! మావాళ్ళందరికీ పోయేకాలం వచ్చింది కాని నాకుమట్టుకు రావటంలేదు అందుకే పోతున్నా కోప్పడక.

(నిష్క్రమించు)

భైర—ఏమిటో పిచ్చివాడులే. అయితే నీవిప్పుడు చెప్పిందికూడా మన తల్లి సలహాతీసుకొని చేద్దాం.

[మోహిని ప్రవేశం]

మోహి—నా బిడ్డలారా! ఆవదరు బోతెక్కడ?

భేతా—వదరు బోతెవరు?

మోహి—పేద బ్రాహ్మణుడు.

భేతా—నిన్నేమైనా అన్నాడా? చెప్పు. ఈడ్చుకొస్తాను.

మోహి—పిచ్చివాడల్లే వున్నాడు. వాడి జోలెందుగ్గానీ విద్యానిధి యేడి?

భేతా—కోట దగ్గఱున్న సైన్యాల్ని చుట్టుపట్లకి పంపించటానికె పోయాడు. ఇప్పుడే వస్తాడు.

మోహి—మంచి అదును దొరికినది. విద్యానిధి వచ్చిన తక్షణమే మాలిమి చేసుకొని మధుపాన మత్తుణ్ణి చేస్తాను. వానిని గూడా

వెంటనే బంధించి, పిమ్మట, కోటలో ప్రవేశించి, భరతమాతను, జనకుణ్ణి శూరుణ్ణి, రత్నాన్ని బంధించి చెఱసాలలోఁ బెట్టి భరతరాజ్యలక్ష్మిని మీరు చేట్టబట్టండి. అపుడు నా కళ్లు చల్లారుతై.

భేతా—మా సంకల్పం గూడా నంతే. (చూచి) విద్యానిధి వస్తున్నాడు (మౌనము) దయచేయండి.

[విద్యానిధి ప్రవేశం]

విద్యా—మిగతా మిగిలినవారిని పట్టుట బహుసులభం. కోటదగ్గఱి సైన్యాల్ని ఇంకో చోటికి పంపించటమైంది.

భేతా—సకలసద్గుణనిధీ ! విద్యానిధీ !

మ. సుముహూర్తంబునుజూచి సర్వదిశలన్ శోభిల్లగాఁజేసి, భూ
రమణుల్ కానుకలంప, యీభారతసామ్రాజ్యంబు నీకింక, ప
ట్టముఁగట్టించుచు మామనోరథము వేడ్కన్ వేగ నీడేరగాం
చమె; నీకోమల పాదసన్నిధిని ప్రశాంతంబు విశ్రాంతియున్.

విద్యా— ఆనందసునామధేయా !

ఉ. ఎమ్మెయిఁ తమ్ములొంటిపయి నీగనువాలఁగనీయనట్టి భా
వమ్మునగాచు నగ్రజుని వంచనచేయఁగడంగినట్టి, యీ
తమ్ములు నాకేల ? శపథమ్ముగ నన్నుతరించు దూరదే
శమ్ములవారు మీరలె నిజమ్ముగ తమ్ములు నమ్ముడీ నుడిన్.

భేతా—మేమూ ఆమాదిరిగానే త్రికరణశుద్ధిగా భావిస్తున్నాం కొంచెం సేపు తమరిచ్చటే విశ్రాంతి తీసుకోండి. తదుపరి భావికర్తవ్యం ఆలోచిద్దాం. మేమిప్పుడేవస్తాం.

విద్యా— మంచిది. వెళ్ళిరండి బాబు (భేతాళభైరవులు నిష్క్రమింతురు)

మోహి—ఈ మాయదారిగొడవలో చాలా బడలిక పడ్డారు.

విద్యా— నాకు బడలికేమిగాని, పాపం మీ ఆనందానికి మీ సత్యానికి బడలిక రావచ్చు. చాలా కష్టపడ్డారు.

మోహి— వాళ్లు పుట్టిపెరుగుతున్నది మొదణ్ణుంచీ, ఒడుదుడుకైన కాపురాల్లోనే వాళ్ళకి బడలికేమిట్లెండి.

విద్యా—మీరు సాధుజనవంశీయులు కనుక కష్టాలు చెప్పుకోరు

ఉ. కానఁగ నింక ఈభరతఖండమునెల్ల మదీయబాహులన్
దీనదయాసముద్రులయి నీసుతులందఱు మోపుచుండిరీ
లోన ముదమ్మెుగా రసికలోకము నిన్గొనియాడునట్లు వి
ద్యానిధినీకరంబులకు దక్కెను! నాభువనైకమోహినీ.

మోహి— ఇప్పటికి ధన్యురాల్ని అయినాను. (ఇస్కీయిస్తూ) కొంచెము ఇది స్వీకరించండి. బడలిక తీరుతుంది.

విద్యా—(ఇస్కీ త్రాగి) నాజగదేకసుందరీ! నీకన్న నాకు పంచప్రాణాలూ తీపిగావు యీయిస్కీలూ తీపిగావు. అనుపమానమైన నీ కోమల కమనీయకరుణాకటాక్షమే నాకస్వైశ్వర్యము.

స. తళుక్కుబెళుక్కులఁ జూపి పుల్కరింపుచు మేను
పల్కరించి మనస్సు కల్కబెట్టు
కులుక్కకల్కము వంటఁ జిల్కరింపుచు, గుండె
గొంతుకలోన రేగింతు మంట
తలపుతెరలనుండి వలపురసము పిండి
అన్నహితముగూడ మన్నుసేయు
పిలుపు సంజీవితో బలుపుఁ దెప్పింపుచు
భయనిశీథిని పట్టపవలుసేయు
సీగులాబిదెబ్బలిక బాగోగులెంచ
కాలుబిడ్డల నాగంగ పాలుసేయు

కలిః ! నీపాదసన్నిధి మెలఁగినపుడు
కష్టములు కనపడవేమి కారణంబు.

మోహ—ఇహ విశ్రాంతి పుచ్చుకోండి.

[విద్యానిధి పరుండును, మోహిని పాదసేవజేయు. విద్యానిధి మత్తువచ్చి స్పృహతప్పి పుండును]

భేతాళభైరవులు వచ్చి బాధించి తీసుకొనిపోదురు

మోహి—ఇంక సమస్త భరత సామ్రాజ్యం చేజిక్కినది. ఇహ నా కుమారులను భరతసామ్రాజ్యపట్టాభిషిక్తుల్ని చేయాలి. మిగిలిన వారిని అవలీలగా జయించవచ్చు.

(నిష్క్రమించు) (తెరపడు)

2 వ రంగం

అంతఃపురం

[రాజ్యలక్ష్మి నిలపించుచుండును]

రాజ్య—అపారసంసారదుఃఖాటవిలో కేవలం వొక్క బిక్కచిక్కిన పేదవారలేకాదు చిక్కువడినది.

ఉ. అత్తులచే నదీనదములన్నియు నాపఁగలట్టి ఆసహా
స్రాక్షుఁడు చొర్వలేని గహనాంతరభూముల కేలికైన హ
ర్యక్షము వేటగాని వలయందగచాట్లకు చిక్కినట్లు నేఁ
డీక్షితినాధులెల్ల హరిణేక్షణకొక్కతె కొరచిక్కరే.

నన్నుతక్క అన్యుల్ని కలలోనైన కన్నెత్తి చూడమని శపథం చేసిన నానాధులెంతపనికి పాల్పడ్డారో చూడండి.

[శూరుఁడు ప్రవేశం]

శూరు—

గీ. అన్యకాంతను నాఁడు పెద్దన్నలెల్ల
పాదదాసులై రాజ్యసంపదలనెల్ల
పాడుసేయుచున్నారన్న నాఁడు నీవు
చెవిని నిడితివే రాజ్యలక్ష్మలలామ.

నేఁడైననూ తెలుసుకొంటివా? దానిగడప తొక్కినప్పణ్ణుంచీ అన్నలు ఎంతరహాగా మారారో చూడు.

ఉ. కంటికిఱెప్పలై తుదకు కాలికిఁ త్రోవకు చెప్పులై కృపన్
మింటను గొడ్డులై కడుపునిండెడి ప్రేమనుగన్నవారలై
పంటవలంతిగా భరతవర్షము నోసంగినట్టి యీ
యింటిలో తల్లిదండ్రులను నేఁడు పగొచ్చిరి దుష్టచిత్తులై.

రాజ్య—మీరుచెప్పినా వినకున్న మీతలిదండ్రులు చెప్పి చూచినను వినకుందురా?

[రత్నం ప్రవేశం]

రత్నం—అన్నలు కారు అహంకారులు.

ఉ. పిన్నలు మీరటంచు గినిసించి గణించక మమ్ము నింటి పె
ద్దన్నలుసూచి, మూలఁగల యాపది గూడ తెగించి, మీను పె
ద్దన్నలటంచుఁ బల్కితుద కాపడమంత్రపువారిచేత పె
ద్దన్నలు కీలుబొమ్మలయినాఁడు యేమ్మమొగమ్ము వెట్టెనా?

శూరు—తమ్ముఁడా! కార్మికరత్నమా! నీవు చెప్పిందంతా వాస్తవం.

రత్నం—అన్నా! శూరాగ్రేసరా! నాగేటిపాటుదోరా!

మ. శ్రమకెంతో చెమటోడ్చి, మొక్కుబడుల శ్రాంతంబు నీడేర్చి, భూ
రమణుల్ మూపున మోపఁబడ్డ ధరణీరాజ్యంబు పూల్పల్లకీ

సమమున్ జేసెడి కష్టజీవులకు విస్పష్టంబుగా నింక నా
జ్యములో సౌఖ్యములేని దుర్దశని సంస్థాపించుటే యన్న లే.

శూరు—తమ్ముడా! అన్నలు అంత దుర్దశ దెచ్చిపెట్టినట్లైతే.

మ. ఇదిగో! భూధవులన్ ధనాధిపతులన్ హిందూ ముసల్మానులన్
పదిలంబౌగతిపై డిమేడలపయిన్ పాదంబులెట్టించు బ
ల్మిది. బల్కల్మిది, నాహలాయుధము; బల్మిన్ భూమినిర్ధానిచే
కుదళింతున్ విదళింతు దుర్దశలకున్ ఘోషించ భూవల్లభుల్.

[భరతమాత జనకుడు ప్రవేశింతురు]

భరత—నాచిన్నారితనయులారా!

[ఆదుర్దాతో తిక్కశాస్త్రి ప్రవేశం]

తిక్క—(ఆదుర్దాగా) అయ్యా! జనకమహారాజా! ప్రళయం ప్రళయం

జనకు—ఏమది? (అందఱు నిలబడి చూతురు)

(తిక్కశాస్త్రి దుఃఖముతో వుంటాడు)

జనకు—అయ్యా! కవిసార్వభౌమా! దుఃఖపడెద రెందుకు?

తిక్క—కుమారులు బంధింపబడ్డారు.

భరత—నాతండ్రులారా (పడిపోవును.)

రాజ్య—మామా (పడిపోవును.)

[శూరుడు, రత్నము, భరతమాత దగ్గరకూర్చుందురు]

జనకు—(రాజ్యలక్ష్మివద్దకు వచ్చి) అమ్మా భారతరాజ్యలక్ష్మీ! భయము
లేదు. అయ్యా! కవిసార్వభౌమా ఏదుష్టులచేతులో బంధింప
బడ్డారు.

తిక్క—పరదేశ వర్తకులచేతిలో.

జనకు—మాబిడ్డలారా!

శూరుడు—నా అన్నలారా!

తిక్క—ఎంత శ్రీమంతమైన విశాలభారతదేశకుటుంబానికి కష్టకాలం దాపరించెరా?

శూరుడు—రత్నమా నీవు యుద్ధసన్నద్ధుడవై ఉండుము. నేనిప్పుడే సర్వసైన్యాల్ని సిద్ధంచేసి వస్తాను. (నిష్క్రమించు)

తిక్క—ఔరా! విశ్వాసఘాతకులారా;

ఉ. దిక్కొకటులేకమున్ బ్రతుకుతెర్వుకు వర్తకవేషధారులై
ఇక్కడ కాలుమోపుటకు నేకులరీతిగవచ్చి మేకులై
మొక్కనుబోని యీభరతపుత్రులమూఢున నేటికౌర, మీ
టక్కరినక్కజిత్తులకటా ప్రకటించిరె యన్నయింటిలో. అకటకటా.

సీ. చల్లనినీదుసంసార సాగరనౌక
నీతిమింగిలజాతి యెపుడుకనిమె?
పచ్చని నీకుటుంబపు కల్పవృక్షమ్ము
నీవేరుపురుగుల వెఘ్లుసూచె
చేవగలట్టి నీసిరిలోగిటి మకరం
బులకీ చెదలుపట్టెపుడిలపట్టె?
ముద్దులుగుల్కు నీయస్త్రాలనేడపై
నీచిచ్చులపిడుగు లెపుడురాలె?

గీ. నేడునీయసమాన నిర్నిద్రశౌర్య
ధైర్యసింహపరాక్రమధుర్యులైన
తనయులందఱు పిఱికిపందలయి, పట్టు
బడిరె! చెడుగులచేతిలో భరతమాత.

రత్న—(కోపంతో) ఏమంటివి.

చ. చెడుగులు పన్నుపన్నుగడ జీవితమందెపుడెంచనట్టి పే
ర్పడియు నమాయకత్వమున భారతవీరులు ధీరులాదురే

గడుసులుగాంచగ నిముఱుకప్పిన గొప్పప్రతాపవహ్నినిన్
పడగలనెత్తమో పిరికిపందల మూఢుమొ చూతువి తరిక్.

[శూరుని ప్రవేశము]

**శూరు**—రత్నమా! భగతసామ్రాజ్యకోట కూలినది.

రత్న—ఏమది!

జనకు—అదేమిటి,

**శూరు**—సైనికశిబిరములో సైనికులెవ్వరూ లేరు, ఆయుధసామగ్రియూ లేదు.

తిక్క—సైన్యాల్ని గూడా స్వాధీనం చేసుకొన్నారా? అయితే ప్రళయమే!

జనకు—ప్రళయమూ లేదు గిళయమూ లేదు. మాట్లాడకండి మీరు.

రత్న—కోటకూడా పట్టుడించటానికి ప్రయత్నిస్తున్నారేమో. మనం గూడా సిద్ధం కావాలి.

(ఫిరంగిమ్రోత వినబడును)

తిక్క—(ఉలిక్కిపడి ముందుకు పడును)

శూరుడు—(తిక్కశాస్త్రిని లేవతీసి) మీకు వచ్చిన భయం లేదు. భయపడకండి.

జనకు—నలువంకల చూచును.

తిక్క—(వణకుచు) మా యింటిదగ్గఱ సమాచారం ఎట్లా ఉందో చూచొస్తా. (పోబోగా తిరిగి ఫిరంగి మ్రోగును. తిక్కశాస్త్రి ఉలిక్కిపడి అమ్మో అని వెనుకకు వచ్చును)

జన—బిడ్డలారా భయపడకండి పీరిని పంపించి ప్రభంజనుడు దండధరుడు ఎక్కడున్నారో జాడ తెలుసుకొని తీసుకొనివస్తాను. మీరు

మీతల్లిదగ్గరా రాజ్యలక్ష్మిదగ్గిరా బహుజాగ్రత్తగా ఉండండి.
రండి తిక్కశాస్త్రిగారు!

తిక్క—ముందు మీరు త్రోవతీయండి బాబు (నిష్క్రమింతురు)

(రత్నం భరతమాతదగ్గర శూరుడు రాజ్యలక్ష్మిదగ్గిర కూర్చుంటారు)

రత్న—తల్లీ దుఃఖించకు

భరత—నాతండ్రీ ఆభయంకర దారిద్ర్య పిశాచి చేసిపోయిన ప్రతిజ్ఞ
చెల్లించుకొంటానికి నాగుమ్మం యిూ రోజిగా త్రొక్కనదా ఏమిరా

రత్న—తల్లీ అట్లున్నటికి తలంచవద్దు.

ఉ. నీకడుగొట్టుబిడ్డడల నివిడుచల్లనికూర్మిదీవెనల్
సోకి, విశాలభారతియశోలతికా, కమలాయతాక్షినిర్
వ్యాకులమప్డులేని తనవజ్రపుటెక్కలపై పనిల్పి, సు
శ్లోకుడటంచు దల్పబడి చోర్వగనిచ్చునె తూమదేవతన్.

రాజ్య—అత్తా భరతమాత వెనకవచ్చిన దుస్స్వప్నపిశాచపు బలమేనా
ఇది ?

శూరు—దేవీ ! భారతసామ్రాజ్యలక్ష్మీ! నీవట్లాఎన్నటికి శంకించి
చింతించవద్దు.

గీ. ఈసమస్తజీవులకెల్ల గ్రాసవాస
ముల నొసగికాచుచుండెడి బలిమిగల, హ
లాయుధుడు భారతీయుడు శ్రీయుతుండు
పీడకలజేసి రాజ్యమ్ము విడచునేమి ?

(ఫిరంగి మ్రోగును)

రత్న—అన్నా ! ఆశతఘ్నిమ్రోత యెక్కడ ?

శూరు—తమ్ముడా ! జాగ్రత్త. శత్రువులు కోటముట్టడిస్తున్నట్లున్నారు.

భరత—నాతండ్రులారా ! మీతండ్రి ఇంకను రాకపోయెనే ?

రత్న —రాగలడు భయపడకతల్లీ. (చూచి) అన్నా ఆదుష్టుడెవడు లోపలికొస్తున్నాడు (లేవబోగా తల్లిపట్టుకొనును)

శూరు— (లేచి) ఓరీ దుర్మదాంధ నిలువక్కడ. (పోబోగా రాజ్యలక్ష్మి పట్టుకొనును)

[భేతాళ భైరవులు ప్రవేశింతురు]

భేతా—(నవ్వి) పెద్దన్నల బలాబలములేవో బట్టబైలయినవి. ఇంక మీసరుకుకాస్తా మిగిలింది.

రత్నం—నాలిముచ్చునవ్వులు కట్టిపెట్టు.

భై ర—కట్టిపెట్టటానికే వచ్చింది.

శూరు—ఈతంబళ్ళమొగాలేనా కట్టవచ్చేది.

భేతా—ఇంతకుముందు ఏ మంగళప్రదమైన మొగాలు బంధికానలో పడ్డవి ?

రత్నం—మాకుండటానిక పంచనిచ్చి బ్రతికటానిక శాశ్వతజీవనోపాధి జూపించినవదాన్యులు.

భై ర—ఏ మహావీరులవల్ల ?

శూరు—తిన్నయింటి వాసాలు లెఖ్ఖబెట్టెడి వీరులవల్ల.

భేతా—(నవ్వి) సీ. ఓహో ! మీఘనధైర్య సాహసదీపిక
జూపి, మీమొగములు సూపుడింత ?

రత్న— అహహ; మాధైర్యసాహసలక్ష్మినిన్ గాంచ
కనులున్నవో మీకు కనులులేవో !

భేతా— ఔర ! మీతెల్వులు పారలేవిపుడింత
వదరకమాకాళ్లు పట్టుడింక

శూరు— మీమేకపోతుగాం భీర్యముసాగదు
స్రెలక, నోర్కట్టి పెట్టుడింక

భేతా—— ఏమి! యుద్ధైర్యమే మెచ్చుటగనలేదు
బహుమానమిత్తుము పట్టుడింక

రత్నం—— తమరిప్పటి కవమానమును ముట్టకమున్నె
వచ్చినదారిని పట్టుడింక

భేతా—— ఎన్ని చెప్పిన వినకున్నమాత్రమె మీకు
తప్పునా తుదకు మా దండనీతి?

శూరు—— ఎంతమర్యాద మే మిపుడు కాపాడిన
మీబుద్ధికింక యీ మేదినిపయి

రత్నం—— గీ. మమ్ముఁ బోలినపిన్నలు తమ్ములిచటఁ
దగినశాస్తి కావలెనేమొ బిగువువదల

భేతా—— మీకెమాట్లాడుకుడి, మిమ్ము మ్రింగివైతు

శూరు—— వలిలేస్తి పొట్టఁజీల్చు చెడుగ.

భేతా——సైనికులారా! ఊఁ...(రత్నం శూరుడు నిలిచి చూచుచుండ సైనికులు చుట్టుముట్టడివేసి బంధించుచుందురు)

భరత——(దుఃఖమున) నాబిడ్డలారా! మీతల్లికె దిక్కెవరురా? (లేచి దగ్గరకు వచ్చును)

భేతా——(బిగ్గరగా) నీకు దిక్కా? మున్ను నీచేత వెడలగొట్టబడిన దరిద్రదేవత (కాలితో తన్ని పడద్రోయును)

భరత——నాతండ్రులారా! ఎంతదురవస్థ పట్టెరా.

[బంధించబడిన శూరుని, రత్నమును తీసుకొని పోవుచుండగా రాజ్యలక్ష్మి వెంట నంటుచూ]

రాజ్య——(దుఃఖమున) నాప్రాణనాథులారా! ఈభారతరాజ్యలక్ష్మికి దిక్కెవరు?

భేతా—ప్రచండశపథము చెల్లించుకొన్న యీభేతాళుడే. (దగ్గరకువచ్చు)

రాజ్య—(కోపముతో) ఛీ! దుష్టుడా దూరముగా నిలబడుము.

భేతా—దూరముగా నిలిచెద, తమ్ముడా! భైరవా! దానిజుట్టుపట్టి యీడ్చుకొనిరా!

రాజ్య—(భయకంపితయై) దైవమా!

కీర్తన

నిగమశాస్త్రనేతలారా!
నిజాచారఘనమునీంద్రులారా!
ఓమహాత్ములారా!
ప్రజలు దురాత్ములు మాస్వరాజ్యధనలక్ష్మి
బట్టి యీడ్చుచుండిరి ॥ని॥

భైర—(దూకుడుగావచ్చి జుట్టుపట్టుకొని లాగి) కదలు గయ్యాళిగంప.

రాజ్య—(దుఃఖమున) అత్తా! భరతమాతా! పురుష సింహులయిన నీకుమారులేరి? మామా! జనకరాజసార్వభౌమ! నీకుమారుల బలపరాక్రమము లడుగంటెనా? (నిష్క్రమింతురు)

[భరతమాత అక్కడ పడియుండును. ఆభయానక గేహమున విషాదధ్వనులతో ప్రక్కవాద్యములు మారు మ్రోగుచుండవలెను]

భర—సాటిలేని నారత్నగర్భము దుర్భర శోకాగ్నిగుండము జేసితివా? లోకరక్షకా! అనుపమాన నవరత్న దేదీప్యమానమగు ఈభరత సామ్రాజ్యకోట కూల్చి పాడుపడ్డ కొంపచేసితివా? మహాను భావా! అసమానమేధాసంపన్నులగు విద్యానిధులారా! మిమ్ము గన్న యీభారతమాతజనని యీనిరంకుశ భేతాళభూపాలకుల కమ్ముకొంటిరా! అనివార్య శౌర్యధుర్యులైన పురుషసింహు

లారా! భరతవంశ సత్క్షత్రియులారా! ఈ మీకన్నతల్లిని కటికవాండ్రకొప్పజెప్పితిరా! అతులిత వజ్ర వైడూర్యమణి హార్మ్యములలో! ముద్దుముచ్చటలతో కాపురములుసేయు నా ధనఘనులైన కుమారులారా! మిమ్ముగన్నతల్లి కడగండ్లు కనుపించుటలేదా?

గీ. నాదునాగేటి సాటుదొరా! దురంత
కష్టజీవి సహోదరా! కడకు నీదు
కూలితమ్ముని తోసాటు కూలిపోయి
భరతమాత నీభేతాళ వ్రాత కడిగె.

(పడిపోవును)

[జనకుడు ప్రవేశము]

జనకు—(ఆశ్చర్యముతో) ఏమిది! నాబిడ్డలేరి (దుఃఖమున) ఈ నెత్తుటిబిందువులెచ్చటివి (భరతమాతవద్దకు వచ్చి) తనయులెక్కడ? రాజ్యలక్ష్మి యెక్కడ? (దుఃఖమున) నీవు కూడా నన్నొక్కనిజేసిపోతివా? భరతమాతా! అష్టైశ్వర్యవంతురాలవై వీరాభిమన్యుల విశ్వదాతలను కని! తుదకు అష్టకష్టములకు లోనయి నన్ను మందభాగ్యుని చేసి పోతివా? విశ్వవిఖ్యాతి గడించిన సీతనయులు నీవు నాకంటికి కఱవైనచో నాకీప్రపంచపుజోలియేల?

సీ. నీకన్న నోర్పు క న్పించు భారతమాత
భూదేవి! మిడిసిపో బోక నీవు
నీకంటె సుగుణమ ణియె; నాభరతరాజ్య
లక్ష్మి ప్రకృతికాంత లగ్గుపడక
నీకన్నచల్లని నృపతులే భరత ప్ర
భులు సుధాంశుడ! పైన కులకకీవు

నీకంటె బహుతేజ నీయులే భారతీ
యులు, సహస్రాక్షుడా యుబ్బిపోక

గీ. దశదిశాంతశుద్ధాంతసౌదామినీ, ల
తాంతములవన్నె కెక్కించు సస్మృతీయ
భారతీయ నృపాలకత్వముల పిదప
తమవెలుఁగు లన్ని యెందుకు చమురుచేఁ॥.

(తెర పడును)

3 వ రంగం

[1 వ ఖైదు విద్యానిధి మాసిన గడ్డముతో పిచ్చిదానివలె నుండును]

విద్యా—ఎంతఘోరము, ఎంతవిశ్వాస రాహిత్యము. సకలవిద్యా శేముషీధురంధరుఁనై నాన్నలురి సోదరులను చేతబట్టుకొని విజయుడనై భరతఖండము పరిపాలించుచున్న నేను, మత్తేభము మాదిరి యీనాడు కుటిలులు త్రవ్వినగోతిలోఁబడితినే (వార్డరు తిరిగపోవును)

2 వ ఖైదు ధర్మరాజు మాసినగడ్డముతో పిచ్చవాడై యుండును.

ధర్మ—ఎంతనమ్మించిన స్వామిద్రోహము. ఎటువంటి కపటనాటక సూత్రధారులు అఖండభరతరాజ్య పరిపాలనాదక్షుడనై, ధర్మరాజునని పిలువఁబడి తుదకు మదించిన వృషభముమాదిరి యుంగిడిగడ్డిమేసి క్రూరులచెఱలో గిలగిల తన్నుకొనిచావ వలసివచ్చినది. (వార్డరు తిరిగిపోవును)

3 వ ఖైదు బలుడు మాసినగడ్డముతో పిచ్చవాడై యుండును.

బలుడు—ఎంత దురాగతము. ఎంత మాయవేషధారులు. అనంతకోటి ధనాగారములపై పడగలెత్తించి భరతసామ్రాజ్యము

నష్టైశ్వర్యములతో తులదూగించు బలుడనై కడకు జాలరివాని గాలమునకు, జిక్కిన చేపమాదిరి దుష్టులకుచిక్కితిని ?

(వార్డరు తిరిగి పోవును)

[4 వ ఖైదు శూరుడు చినిగి మాసిపోయిన గుడ్డలతో కృశీభూతశరీరుడై యుండును]

శూరు—తల్లీ ! భరతమాత ! తండ్రీ ! జనకరాజసార్వభౌమ ! దేవీ ! భారతరాజ్యలక్ష్మి ! ఈశూరుని రక్తనాళములలో ప్రవహించు వేడిరక్తము చల్లారలేదు. దుఃఖింపకుడు. ఈశూరుని బొందిలో ప్రాణముండువరకు మీమీ మనోవాంఛా ఫలసిద్ధికే పాటు పడును. (భరతమాత జనకాదు కనిపింతురు) జననీజనకులారా ! బిడ్డలపై మీప్రేమ అపారము.

(వార్డరు తిరిగి పోవును)

[5 వ ఖైదు రత్నము చినిగిన గుడ్డలతో వికారస్వరూపము తోయుండును]

రత్నం—తల్లీ ! భరతమాత ! దుఃఖింపకుము. తండ్రీ జనకరాజా ! ధైర్యము గోల్పోకుమయ్యా ? దేవీ ! భారతరాజ్యలక్ష్మి ! ధైర్యము విడనాడకుము ! జననీజనకులారా ! మీరత్నగర్భమున జన్మించి మీచల్లని ఆశీర్వాదములచే జెరిగి మీఅమృతదృక్కులు ప్రసరించుచోట్ల దిరిగి చిరంజీవులమై భోగభాగ్యసమన్వితమైన సంపన్నగృహస్థులమైయున్న యీ మాకడసారి తనయులు తుదకు మీవార్ధక్యదశలో కష్టకాలమున కొట్టుకొని పోవుచున్నను మీపావనపాదపద్మముల తలదాల్చుట మానుకొనరు. అమూల్యమైన మీపుత్రవాత్సల్య ఋణమును దీర్చ

నిదేమున్నున్ను మీకడగొట్టుబిడ్డడు యీభౌతికదేహమును విడిచి పెట్టును. (భరతమాత, జనకుడు కనిపింతురు) లేచి నన్నుగన్న తలిదండ్రులారా! నమస్కారములు (దీవించి అదృశ్యులగుదురు) మీఅపారమైన పుత్రవాత్సల్యము కడుపారబిడ్డలగన్న తలిదండ్రులకే తెలుసు.

(నారదరు తిరిగి పోవును)

4వ రంగం

[భేతాళ సామ్రాజ్య పట్టాభిషేకమహోత్సవము ఏనుగులంబారీలపై భేతాళుడు భైరవుడు కూర్చుందురు. అశ్వారూఢులు ముందు నడుచుచుందురు. సైనికులు కదముత్రొక్కుచూ నడుచుచుందురు. బ్యాండు మేళములు వాయించుచుందురు. ఫిరంగులు ప్రేల్తురు. భేతాళమహారాజు గారికి జయజయ శబ్దములు మిన్నుముట్టుచుండును.]

[తిక్కశాస్త్రిముక్కుపై చేయిపెట్టుకొని ప్రవేశము.]

తిక్క——ఎంత కష్టకాలమువచ్చినా భారతసామ్రాట్టులు పదభ్రష్టులై దుష్టరాజులు గజారూఢులై నడివీధులలో నూరేగుచుండిరి? నాకడుపుపగిలి వచ్చుచున్న దుఃఖాగ్నిజ్వాలలు ఈ నిరంకుశ భేతాళప్రభుత్వ భవనములనెన్నడు మారణముసేయునో అప్పుడే నేను కన్నుమూతును. (నిష్క్రమించును)

[ప్రభంజనుడు దండధరుడు ప్రవేశము]

ప్రభం——దండధరా! ఎన్నడు తిరిగి మన భారతదేశ చక్రవర్తుల జూతుము.

దండ——ఇంకా చూచుట దుర్ఘటము. ఈభేతాళ శక్తిని డీకొను వారెవరు?

ప్రభం—నిజమే! వీనిబలము ఆత్రిమూర్తులకు గూడ అలవిగానిది.

దండ—వీనికొలువులో సేవకావృత్తికంటె, ఆకులు, అలములు నట్టడవిలో తిని బ్రతుకుటె ఉత్తమము.

ప్రభం—ఇంత వూపిరి పీల్చుకొనుటకైనా వీని ఆజ్ఞ కావలసి వచ్చుచున్నది.

దండ—అడవిలో మేతగూడా మేయుటకు ఆటకాయించునేమోగా;

ప్రభం—చూడగా చూడగా అంతే ఏపునేమో. పద. ఆలస్యమైతే కొంప మునుగుతుంది.

(నిష్క్రమింతురు)

(తెరపడును)

5 వ రంగం

[భేతాళ ప్రభుత్వభవనము. భేతాళుడు ఆసీనుడై యుండును. సేవకులు, దండధరుడు, ప్రభంజనుడు ఇరుప్రక్కల నిలిచి నమస్కరించుచుందురు]

[మోహినీ ప్రవేశము]

మోహి—కుమారా! భేతాళా! ఈ భారతదేశ ప్రభుత్వపీఠము నీ వధిష్ఠించితివి. నీక్రిందనున్నలోద్యోగస్థులుగా మనదేశీయుల నియమించినను యింతవైశాల్యముగల దేశములో కప్పము రాబట్టుకొనుట కష్టతరము.

భేతా—నిజమే! ఇప్పటికి శిస్తులు వసూలు కాలేదు.

మోహి—అందుకని విద్యానిధిని మన మంత్రిగాను, ధర్మరాజును సామంత రాజుగాను, బలుని షరాబుగాను, నియమించుకొన్నచో, సులువుగా శిస్తులు వసూలు కావచ్చును. వారిని మట్టుకు తక్షణమే బంధవిముక్తుల జేయుము.

భేతా — ఈసలహా అన్నివిధముల బాగుగానున్నది. ప్రభంజనా!

ప్రభంజ — ప్రభూ!

భేతా — నీవిప్పుడేపోయి కారాగారములోనున్న విద్యానిధిని, ధర్మ రాజును, బలునినిడిపించి నాదగ్గఱకు తీసుకొనిరమ్ము.

ప్రభం — చిత్తం. (నిష్క్రమించును)

మోహి — భేతాళా! ఇక్కడిమతము మాపి మనమతము స్థాపించ వలెను. ఇక్కడివిద్య చెఱిపి మనవిద్య నాటవలెను. ఇక్కడ నాగరికత నేలఁగలిపి మననాగరికత నెలకొల్పవలెను. ఇదియే మనరాజధర్మము. దీనివలననే మనప్రభుత్వము నేళ్ళుపోసు కొనును.

భేతా — తల్లీ! నీవుచెప్పినది రాజనీతి.

మ. సకలైశ్వర్యబలోన్నతాశయులు ప్రజ్ఞావంతులీ భారతీ
యకులాంభోధిశశ్యులు కార్యదక్షులు మహీయాశ్చర్యశౌర్యక్రియా
భ్రుకుటీమధ్యనికేవఘాటకుల తోఁల్బొమ్మల్ వలెన్ జక్కరే
యికభేతాళుని డీకొనన్ బుడమిఁపై నెవ్వాఁడు జన్మించునే.

మోహి — పుట్టలేదు. పుట్టలేదు. పుట్టరు. కాని మనమిచ్చట ఏతీరుగా ప్రవేశించి జయించగలిగినామో అదిమఱువకు మఱువగూడదు. యిక్కడ వీరిలో వీరికెప్పటికప్పుడు ఏనిధముగానైనాసరే మిత్రభేదము పుట్టించుచుండిన కాని మనమిచ్చట నిలువ లేము. ఆచాతుర్యమే మనకు ప్రాణరక్ష.

భేతా — యదార్థము.

[విద్యానిధి ధర్మరాజు బలుడువచ్చి భేతాళునకు నమస్కరించి నిలబడె దరు. దండధరప్రభంజనులు యిరువంకల నిలుతురు.]

భేతా — నీ ధర్మబుద్ధికి నీవిశ్వాసపిధేయతకు మెచ్చి మిమ్ముల విడిపించి నాను. విద్యానిధీ!

విద్యా—ప్రభూ!

భేతా—నీవీ నిమిషమునుంచి నా ప్రభుత్వములో ప్రజలందరికి నా మతము,నావిద్య నా నాగరికత నేర్పించుటకు మంత్రిగానుండుము.

విద్యా—చిత్తం.

భేతా—ధర్మరాజా!

ధర్మ—ప్రభూ!

భేతా—నీవు నేటినుండి నా ప్రభుత్వములో కొన్ని పరగణాలకు సామంతరాజువై ప్రజలవద్ద శిస్తు వసూలుచేసి రెండువంతులు మాకు పంపుచు నాచెప్పుచేతలకు లోబడియుండుము.

ధర్మ—చిత్తము.

భేతా—బలుడా.

బలు—ప్రభూ!

భేతా—నీవు నేటినుంచి మాదేశపు వస్తువులను దెప్పించి యిక్కడ వ్యాపారము కొనసాగించుకొనుచు అవసరము వచ్చినప్పుడెల్ల మా ప్రభుత్వపు కోశాగారములకు డబ్బు పెట్టుబడి పెట్టుచుండుము.

భటు—చిత్తము.

భేతా—దండధరా?

దండ—ప్రభూ,

భేతా—మిగిలినశూరుడు రత్నము పొగరుపోతులు. వారిసీతక్షణమే ఆజన్మాంతము ద్వీపాంతరవాసశిక్ష ననుభవించునట్లు నట్టనడి సముద్రముమధ్య ద్వీపములో నిడిపెట్టిరండు. ప్రభంజనా! నీవీముగ్గురిని నీవిప్పుడు చెర్సీనులకు పంపుము.

ప్రభం—చిత్తం. రండిబాబు. (అందరు నమస్కరించి పోదురు)

భేతా—తల్లీ! నాతమ్ముని భైరవుని సర్వసైన్యాధిపతిగా నియమింతును.

మోహి— ఆపదవిలో సీతమ్మసైదప్ప మఱొకనిని ఎప్పుడు నియమించవద్దు.

భేతా— తమ్ముడు వచ్చుచున్నాడు.

[భైరవుడు ప్రవేశము]

భేతా— తమ్ముడా భైరవా యీసకలభారత సామ్రాజ్యసైన్యమునకు నీవు సర్వసైన్యాధిపతిగా నుండుము.

భైర— అన్నా ! నేనదే కోరదలచుకొన్నాను.

మోహి— మీరిరువురు కడుంజాగరూకతతో యీభారతజాతిపై నొక కన్నుంచుడు. నమ్మగూడదు.

(నిష్క్రమింతురు)

తెర బడును.



శ్రీ

# విశ్వస్వారాజ్యము

## పంచమాంకము

### 1 వ రంగము

భేతాళగృహము.

[ఆచరణములన్నిటిని తీసివేసి మాసినచీరతో
దుఃఖపరవశియై రాజ్యలక్ష్మి ఉండును]

రాజ్య—ప్రాణనాథుల విడనాడి పాపిష్టిజీవితము గడుపుకొనుచున్న నావంటి మొండిదాని బ్రతుకు, ఓ భూదేవీ! నీకు భారముకాదా! ఏల నన్ను మోసెదవు. ఏ పడిన సముద్రములో నయినను పడద్రోయుము. నీకు భారము తప్పును! నాకు విచారము తప్పును.

సీ. దుమికి బ్రహ్మాండంబు దూకొటల గూలజేయు
దరికడలి కెరటాల్ తగ్గబట్టి
కన్పించి గుండెలు కరగించు గిరికోట
తేల్కాగా గంటక తేలబట్టి
వినిపించి! ప్రాణంబులను గుప్పెటకు దెచ్చు
సింహగర్జనలు సహించబట్టి
రానిచ్చి! కాళ్ళడగానని సెలవిచ్చు
ప్రభునీవి బొత్తిగా వదలబట్టి

గీ. మనము ప్రాణమువలె నైకమత్యబలము
గలపతులు దుర్గతులపాల నిలువబట్టి
మహిమచితికి యీభరతసామ్రాజ్యలక్ష్మి
చచ్చి చావనిబ్రతుకులో చావవలసె.

నాప్రాణధనులు, నామనోరథసారథులు, నాఅభిమానసామ్రాజ్యధౌరేయులు, నాప్రణయగాన సుధాప్రవాహరాజహంసలు, నా భారతశూరాగ్రేసర వీరాభిమన్యులు, యీనిరంకుశ భేతాళప్రభుత్వకారాగారములలో ఎన్ని పడరానిపాట్లచే, కృశించుచుండునోగదా!

[మోహిని కోపంతో ప్రవేశం]

మోహి.—శుభమా! అంటు నాతనయులు నిన్ను చెట్టబట్టుట ఏమిటి యీఏడ్పుగొట్టుమొఖంతో నీవీమాదిరి నడియింట బడి ఘోష పెట్టటమేమిటి, నీతీరు నాకేమి బాగుండలే.

రాజ్య—(మౌనముతో తలవంచుకొనును)

మోహి—నావంక చూచి మాట్లాడుటకే సిగ్గనిపించుచున్నదిగా.

రాజ్య—(దుఃఖమున) నాకు స్వస్థతగా లేదండి.

మోహి—స్వస్థతగా లేకపోవడానికి తీపరమా, పొద్దస్తమానము మనసు ఎక్కడో ఉంచుకొనే దాపరంగాని, లేనవేమి. అత్తగారన్నగారవంగూడా లేనిపాపిష్టిపిల్లవు దొరికావు, ఎట్లాగైతేనేమి.

రాజ్య—పాపిష్టిరాలితో, బహుశా బుద్ధిమంతులైన మీకొడుకులకు సంబంధమెందుకు. విడచిపెట్టక.

మోహి—ఎంత గడుసుదానవే చచ్చినా మాటపడవు (కోపముతో) యీతడవ నోరెత్తి సమాధానము చెప్పుచూస్తాను. పెద్దంతరము చిన్నంతరము లేక ఈవరస తెగబలిసి కూయరాని కూతలెల్ల

కూస్తావా (భేతాళుడు ప్రవేశము) (పప్పుగొంతుకతో) నేనే నా డుచేసుకొన్న మాయింటి ఆయనచేతనైనా పల్లెత్తుమాటపడి ఎరుగను దీనిపొట్టపగల. దీని నోరెప్పుడు పడుతుందోగానీ.

భేతా—ఏమదితల్లీ !

మోహి—నీవే యిప్పుడు రాకపోతే యీబ్రహ్మరాక్షసి చేతిలో చచ్చిపోయేదానినే రా నాతండ్రీ !

భేతా—(కోపావేశముతో) నీ పూర్వదుర్గర్వ మింకను సాగించదలచితివా (పోయి జుట్టుపట్టుకొని తన్నుచుండ)

[విద్యానిధి, ధర్మరాజు, బలుడు ప్రవేశము]

రాజ్య—(అపార దుఃఖమున లేచివచ్చి విద్యానిధీ ధర్మరాజు బలుల కాళ్ళపై బడుచు) నాప్రాణధనులార రక్షించుడు.

భేతా—తన్ని జుట్టుపట్టుకొని లేవనెత్తి (పడద్రోసి) ఎవడేనన్న డ్డగించేది?

రాజ్య—(పడి) అయ్యో దైవమా ఆపద్బాంధవా యింత నిర్దయా!

మోహి—(కోపముతో తన్ని) సిగ్గులేక గయ్యాళివై వాళ్లవాళ్లపై పడుచుంటివిగా.

విద్య—మహాపాతకము. నీప్రాణనాధుని ధిక్కరించటం తగునా?

బలు—దోషము, నీప్రాణపతిని ఎదిరించి మాట్లాడుట.

మోహి—అట్లా గడ్డిపెట్టండి నాయనా బుద్ధివచ్చునేమో ?

భేతా—ఛీ ! దీనిని పాపమని తలంపకూడదు పదండి పోదాం.

(అందరు నిష్క్రమింతురు)

మోహి—ఛీ ! కన్నెత్తి దీనిమొఖమైనా చూడకూడదు.

(నిష్క్రమింతురు)

రాజ్య—(దుఃఖము) జగద్రక్షకా జనక నిర్విశేషా దయామయా ఆపద్బాంధవా!

చ. పతిని పతివ్రతానిరతిసాకిన సాధ్వని పేరుబడ్డ! భా
రతజనయిత్రి, పుత్రపదరాజము దాల్చిన రాజ్యలక్ష్మినై
క్షితిపై యీగిరాతునకుజిక్కి పరాభవమందునప్డు నా
పతులకు పౌరుషంబు కనుపట్టని దుర్గతికింక చచ్చెదన్.
(పడిపోవును)

తెరబడును.

2వ రంగం

నడిసముద్రపుమధ్య ద్వీపము

[శూరుడు, రత్నం చిక్కిపోయిన గుడ్డలచే వికారస్వరూపములు పడియుందురు]

శూరు—తమ్ముడా! మనజన్మ యీనడిసముద్రపుమధ్య గడచిపో వలసినదేనా!

రత్న—సముద్రునికే మనపై దయలేకపోయినప్డు గడువవలసినదే.

శూరు—

ఉ. మమ్ములగన్న మాభరతమాత పదాబ్జముబట్టియీపెభా
వమ్మునకెల్ల సంతసముపట్టగ భారతరాజ్యలక్ష్మితో
నిమ్మహిపై ప్రశస్తిగడియించు కుమారులబట్టి యీపిశా
చమ్ముల నల్పెరాక్రమముల చందముసాగర జాలిలేదురా!

రత్న—ఆగర్భశ్రీమంతులమనియా నీవుపుల్లాసంతో ఎగసిపడుతున్నావు.

ఉ. నీకెరటాలచేతులలో నిక్కగనీటుగకొల్కుచున్ననీ
రాకొమరుల్ గతుల్ పుడమిరాలిన మాకవిజాలిపుట్టురా?
నీకడభారతీయులకు నీచపుదుర్గతిపట్టెనేడు, ర
త్నాకరసాగరా తుదకుఅంతయు నీకును జాలిలేదు.

శూరు——నీఘోరమైన ఘోషగాని నీగభీరతరమైన స్వభావముగాని, నీ
అనంతమైన విశాలహృదయముచేగాని,

ఉ. దేశముకై సమస్తము విధేయతగా నిలధారపోసి, ఆ
వేశముతగ్గనట్టి రణవీరులకెమ్మెయినైన, సాయముల్
లేశముజేసిచూపెనె కసీసము వీసముగూడ ఆ సదు
ద్దేశము నీకిదేడ ? అదదీనదయాబ్ధికిగాక సాగరా.

రత్నం——నీ అనివార్యశౌర్య గాంభీర్యముచేగాని ప్రచండబడబానల
కీలావళియుతంబైన దివ్యతేజస్సుచేగాని నీ అపూర్వబలగర్వ
సర్వహాణానేక పరాలాపములచేగాని మావంక చూడుము.

మ. ధరణిన్ మూర్ఖులు మత్సహోదరులు స్వాతంత్ర్య ద్రష్టః క్రియా
నిరతిన్ దుర్మతిఖనిన్ కటాకటికివానినిన్ బోలి దుర్మోహి నీ
పరతన్ భారతికామధేనువును నిర్బంధించి హింసించుచుం
డిరి యీలేగల పద్పునింతనిని తండ్రీమమ్ము రక్షించరా.

అన్నా ! ఎంతమొఱపెట్టుకొన్నను; ఈసముద్రుఁడు జాలిపడ కున్నాడు. మనవంటి కష్టజీవులలో, బక్కచిక్కనవాళ్ళతో మాట్లాడటం అతని హోదాకు చిన్నతనం కాఁబోలు.

శూరు——తమ్ముడా ! ఉన్నకొద్దీ, ఈ సముద్రుడు రౌద్రాకృతి దాలుస్తున్నాడు. ఇప్పు డితనికి ఆదరణంటే యేమో తెలియదు. ఆ త్రిజగన్మోహనుఁడైన దయాసముద్రుని ప్రార్థించుదాం రమ్ము.

రత్నం——అన్నా ! నాకు ఆకలివేస్తున్నది.

శూరు——(కన్నీరుకారుస్తూ) అపదోద్ధారకా ! మా కష్టకాలంలో ఈ ఆకలిమంటలుకూడా యేమిటి ? తమ్ముడా ! కూలిరత్నమా ! ఆకలివేసినప్పుడల్లా, యిక్కడ తీర్చువారెవరున్నారు? గ్రుక్కెడు ఈ ఉప్పునీళ్లుత్రాగి చల్లార్చుకోవాలి. వార్ధరుకాఁబోలు వస్తు

న్నాడు. మనమిక్కడికి రావటంచూచి మండిపడతాడేమొ పోదాంపద.

ఇద్దఱూ వెళ్లుచుండగా త్రాచుపాము కాటుతో శూరుడు
"అబ్బా" అని పడిపోవును

రత్నం—ఏమిటి అన్నా!

**శూరు**—అబ్బా! పాము కాటువేసిందిరా.

రత్నం—అదిగో! కోడెత్రాచు, నా అన్నను కాటువేసి పొదలో దూరుతున్నది. అయ్యో! దైవమా! ఈదిక్కులేని అండ మాను దీవులలో నా అన్నను నా నాగేటిపాటుదొరను పాము వాతను పెట్టితివా? అన్నా! హలాయుధా! శూరాగ్రేసరా! ఎక్కడ పాము ముట్టినది? మాట్లాడవేమి? ఈ భేతాళసామ్రాజ్యంలో, నా నాగేటిపాటుదొరను, నా రైతురాజును, నా శూరాగ్రేసర చక్రవర్తిని అకాలమృత్యుదేవత పొట్టనుపెట్టితివా! దైవమా! ఈ నిరపరాధులపైన, ఇంత నిరుపేదలమీద నీ కింత క్రౌర్యం ఎందుకయ్యా? దయలేదా ఓ పంచభూతములారా! మీకైననూ ఈ దీనులమీద దయపుట్టదా? ఓ అనంతగంభీర సాగరా! ఎంత కసిదీర్చుకొంటివిరా? ఓపాపిష్టికాలకర్కోటకా! నీ కసిదీరినదా ఓరీ! దరిద్రదేవతాపుత్రకా! సాధుజనహంతకా నీ కన్నులు చల్లారెనా?

**శూరు**—అబ్బా! అబ్బా! బ్రతకను తమ్ముడా!

రత్నం—(కౌగలించుకొని) అన్నా రైతురాజా నిన్ను విడిచిపెట్టి నే నుండలేను. బ్రతుకలేను.

**శూరు**—అయ్యో! తమ్ముడా! కూలిరత్నమా! నీగతి మెవరు చూస్తారు.

సీ. ధర్మచక్రముఁ ద్రిప్పి దైత్యబాధను బాపు
విద్యానిధుల గన్న వేదవతికి
ధర్మఖడ్గమువట్టి ధరణీతలంబేలు
ధర్మరాజులగన్న ధరణిసతికి
ధర్మలక్ష్మి గడించి ధర్మకర్మల నడ్పు
ధనబలులనుగన్న ఘనమహిళకు
ధర్మసంస్థలనెల్ల తమభుజమ్ము మోయు
కర్షకరాజుల గాంచినట్టి

గీ. భరతమాతకింక విధాతవ్రాతకతన
బలిమి నీకడగొట్టు బిడ్డలు బలియగు
చుండి రీనాడు వగవక గుండెపగిలి
మనదు బాపులతీరురా మాతృఋణము.

(పడిపోవును)

రత్నం—(దుఃఖముతో) అన్నా ! రైతురాజా ! నీకూలితమ్ములకింకా దిక్కెవరు ? అన్నా! మనతల్లికి భరతమాతకు నేనేమనిచెప్పేది? శతవృద్ధుఁడైన జనకుని నేనెట్లా చూచేది ? ఓ అండమానుదీవీ ! నన్నుకూడా నీపొట్టబెట్టుకొని ఆకలి చల్లార్చుకో.

ఉ. అన్న! స్వతంత్రరాజ్యసుగుణాంబుధి ? మంజులవాక్ప్రసూనసం
పన్నకళామృతాంజలి కృపానిధి ! భారతవీరశూరభా
స్వన్నృపచంద్రశేఖర ! ప్రచండహలాయుధ ! భారతావనిన్
పెన్నిధివై శాంతములు పిక్కటిలన్ బడిపోతి వక్కటా.

అన్నా ! నీపసితమ్ముని దిక్కుమాలిన అండమానుదీవికి నొప్ప జెప్పి పోతివా. అన్నా శూరాగ్రేసరా!

[వార్డరు ప్రవేశము]

వార్డ—నక్కి నక్కి యీమూలకు ఆమూలకు వచ్చి దాగటమేమిటి. కంటబడ్డప్పుడు దొంగివేషాలలో ఎక్కిఎక్కి ఏడ్చుటేమిటి పారి పోవటానికి ఎత్తులా ఇది.

రత్న—అయ్యో! మా అన్నను పాము గరచినది.

వార్డ—పాములేదు గీములేదు. పద ఎక్కడ (చూచి) కైలాసానికి దోవ పట్టాడుగాని పద.

రత్న—అయ్యో! మాఅన్నయ్య

వార్డ—అన్న చచ్చాడు. సముద్రంలోకి యీడుస్తాములే నివెందు కక్కడ? పద.

రత్న—సముద్రమా! మాకు దిక్కు. అన్న నేనీ దుఃఖసముద్రంలో ఉండలేను (దూకుడుగా పోయి సముద్రంలో దూకి కనిపించ కుండా పోవును)

వార్డ—ఆగే! ఏమిటీచిత్రం. పీడ సముద్రంలోక దుమికాడేమిటి. పీడ వదలిందిలే మాకు. (నిష్క్రమించును)

## 3 వ రం గ ము

అరణ్యము.

[భీకర ఘోర క్రూరమృగావళులు ఘోరముగా ఘూర్ణిల్లు చుండును. దీనవదనులై భరతమాతా, జనకుడు సంచరించుచు కర్తసహాసెదరు.]

భరత—ఆవచ్చునదెవరు?

జన—మనసంస్థానకవులు గాబోలు.

భరత—తిక్కశాస్త్రిగారా?

జన—అవును మనరాజ్యపతనముతో యీమనకవిసార్వభౌములకుగూడ బ్రతుకుదెరువులేక అడవుల పాలైరిగా? ఔరా! ఎంత పాపిష్టి కాలము దాపరించినది.

[తిక్క—శాస్త్రి ప్రవేశము]

జన, భరత—కవిసార్వభౌమా! నమస్కారములు (నమస్కరింతురు)

తిక్క—పరమేశ్వరా ఈపురాణదంపతులు యీఅష్టైశ్వర్య భోగ పారాయణులకు నేటికెంతదురంతకష్టము బట్టి నట్టడవిలోపడి రయ్యా! (కన్నీరు పెట్టుకొనును)

జన—కవిసార్వభౌమా! చింతిల్లకుము కుశలమేగదా భారతీయులు.

తిక్క—ఈనిరంకుశ భేతాళప్రభుత్వంలో కుశలమెక్కడిది. కుమారుల సౌఖ్యమెక్కడిది. అండమానులలో కొమిలికృశించుచున్నారు.

భరత—(దుఃఖమున) నాతండ్రులా,

చ. పుడమినివీరపుత్రుల సపూర్వయశోధన గేహమందు పు
ట్టెడుకడుపారప్రేమగని ఏలినభారతమాతనేడు కా
రడవులగూలె యీవగపుటశ్రుకణమ్ములుచిమ్మువృష్టిలో
బడిపై మేఘగర్జనవిపాతవిఘాతములెన్నిసూచెనో.

జన—నాభారతవీరపుత్రులారా!

గీ. మేము బంగారుగడ్డపై మిమ్ముబెంచి
మీమృదుకుసుమ ప్రేమాంజలీమణి ప్ర
సూనడోలికలఁపసికూనలవలె
పెరుగుమాపై పిడుగులు గుప్పించదగునె.

కవిసార్వభౌమా! యీవార్ధక్యదశలో కుమారుల బలిమికలిమి గోల్పోయిబ్రతుకుట దుర్ఘటము.

తిక్క—జనకమహారాజా చింతిల్లకుడు వృద్ధదంపతు లిట్లు కన్నీరు బెట్టుటచే సకలక్షమాగుణ సంపన్నురాలగు భూదేవిగూడ నడగి సముద్రములో గలసిపోవును. ఆ వినవచ్చు ఆర్తకంఠధ్వని ఎవరిది?

భరత—(దుఃఖమున) నాబిడ్డడేమొ.

జన—పిచ్చిదానా నీబిడ్డలందరు నిర్బంధింపబడిరి.

తిక్క— అందరుకాదు హలాయుధుడైన శూరుడు. నిరాయుధుడైన కార్మికరత్నము.

జనకు—మిగిలినముగ్గురు.

తిక్క—మిగిలిన విద్యానిధి ధర్మరాజు బలుడు విడుదలకాబడి ఆనిరంకుశ భేతాళ నృపాలకులలోబడి బానిసలై బ్రతుకుచున్నారు.

భర—నాతండ్రులారా మీకెంత దురవస్థపట్టెరా వింటిరా తిరిగి ఆ ఆర్తారవము నా కడగొట్టుబిడ్డడే.

తిక్క—రత్నమేకాబోలు.

జన—మనబిడ్డడే.

భర—నాతండ్రీ! (కౌగలించుకొనును.)

జన—కుమారా! (కౌగలించుకొనును.)

తిక్క—ఆహా పుత్రవాత్సల్యము, అమూల్యము. జననీజనకుల ప్రేమ అపారము. నాయనా రత్నమా కుశలమా నీయన్న శూరుడు గూడా వచ్చుచున్నాడా.

రత్నం—అన్నా (దుఃఖమున బడిపోవును)

భరత—నాతండ్రీ శూరుడెక్కడ?

జనకు—దుఃఖపడెదవేమిరా తండ్రీ.

రత్నం—(దుఃఖమున) అన్నను పాము కరచినది.

భరత—(దుఃఖమున) నాతండ్రీ నా నాయనా (పడిపోవును)

జనకు—నాతనయా నాగేటిపోటుదొరా (పడిపోవును)

రత్నం—అన్నా! రైతురాజా (పడిపోవును)

తిక్క—దైవమా అమృతదృష్టిగల నీవు కూడా విషదృష్టి గలవాడవైతివా. అనుపమాన ధర్మపథానువరులైన నిరపరాధులైన నా భారతయోధులు నా నాగేటిపోటుగాలు నీకేమి యెగ్గొనరించిరయ్యా, ఆపదోద్ధారకా!

భరత—(దుఃఖమున)

మ. కొడుకానగుమోములయ్య కొడుకా గోవర్ధనోద్ధారణా
పుడమిన్ భారతమాతజీవితము మాపున్ మోయగా నిత్తరిన్
కడుభారంబయి కూల్చితేమి కొడుకా, నావంశరత్నాకరా
చెడుగా కాలుడ నాహలాయుధుని నాచిన్నయ్యనిన్ జూపవా.

జనకు—(దుఃఖమున)

మ. సతమున్ బిడ్డలమీదచూపున తరెంచన్ గల్గు యీవృద్ధ దం
పతులీ ఘోరవిషాదవహ్ని కకగర్భచ్ఛేదమై వారిధి
కుతలంబున్ మనుపన్ దురాగతము లీక్షోణీస్థలిన్ బుట్టె దు
ర్మతులారా ప్రళయాంబుధిన్ మునిగిపోరా మీరు మీరాజ్యముల్.

తిక్క—జనకమహారాజా!

జన—స్వామీ!

తిక్క—ఇప్పుడు మనమెంత విలపించినను ప్రయోజన మేమున్నది? ఇది అరణ్యము ఆలకించువారెవ్వరు? ఆదరించువారెవరు? అరణ్యరోదనమగును.

జనకు—అయ్యా నిజమే భావి కర్తవ్యమేమి

తిక్క—రాజ్యాధికారములోనున్న బిడ్డల పాలిటబడి మన దురవస్థ తీర్చుకొన జూచుటే.

జనకు—అవును మీరు భద్రముగా మాకు మార్గదర్శకులై గొనిపొండు.

(తెరబడును)

## 4 వ రంగము

### విరహాప్రదేశము

[భేతాళుడు విద్యానిధి ప్రవేశము]

భేతా— విద్యానిధీ!

విద్యా— ప్రభూ !

భేతా— నాభాషాప్రభుత్వ మీనము కడు నేర్పుతో అధిష్ఠించితివి. గాని మీ భాషారాంచుకులను కుంకుడువేళ్ళతో సయితము లాగించితివా.

విద్యా— చిత్తము చాలాభాగము నిర్మూలము జేసితిని.

భేతా— మతము సంగతి.

విద్యా— ఆదియు చాలభాగము చితిపివేయించినాను.

భేతా— సరే, ప్రజలకు మా ప్రభుత్వముపైన భక్తి విశ్వాసములు గలుగజేయించుచుండుము.

(భేతాళుడు నిష్క్రమించును)

విద్యా— బలవంతులదే రాజ్యము. కనుకనే ఏకఛత్రాధిపత్యముగా భరతఖండ మేలగల్గుచున్నారు. (చూచి) వీరెవరు ప్రేత మొగాలు.

[భరతమాత, జనకుడు, రత్నం, తిక్కశాస్త్రి ప్రవేశము]

విద్యా— ఈవికారస్వరూపములతోనున్న మీరందరెవరు ?

భరత— నాతండ్రీ నేను నీతల్లిని. వారు నీతండ్రి. వాడు నీతమ్ముడు. వారు కవిసార్వభౌములు. మమ్మునురచిపోతివా ?

విద్యా— (ఆశ్చర్యముతో అసహ్యగించుకొనుచు)

ఉ. ఎబ్బెరికంపురూపముల వేమిటి ? సిగ్గునులేక మీర లీ
దబ్బరలాడనేటికి వృథాధిషణా లిపినానృపాలన్

బెబ్బులియైనవాడెచట పిల్లికిబుట్టినవాడటంచు పె
ల్లబ్బురరీతి పిల్వబడెనల్పముగా ముదివొగ్గదంపతుల్.

రత్నం—

మ. పులిగర్భంబున పిల్లికూనలయి భూపుల్ శేముషీదోర్బలుల్
కవికాలార్భటినున్న ఘోరరిపు భూకాంతాళినిన్ గెల్చుచున్
బలగర్వంబున తల్లిదండ్రులను యేడ్పించొచ్చి మైమర్పుతో
కొలువున్ దీర్చి కృతఘ్నులై తిరశతఘ్నుల్ ప్రేలుమీఱాత్ములన్.

జనకు—నాయన తొందరపడకు.

విద్యా—ఓగీ అర్భకా ఏల నిరర్థకముగా ప్రేలెదవు.

భరత—నాతండ్రీ వాడు చంటివాడు. నీనాలవాతమ్ముడు. నాగేటిపోటు దొర శూరుడు.

ఉ. నీనినుమేనికాంతి కడునిగ్గుగదెచ్చిన రైతురాజు భూ
జాని కిరీటరత్నమణిసంపుట సద్ఘృణిజాలతేజుడున్
మానుషవేషరోషబల మానితకీర్తిక చక్రవర్తివి
ద్యానిధి యీకిరాతనృపదైత్య దురాగ్రహావృత్తి గూలెరా.

విద్యా—మీరెవరో నాకు తెలియదు. నీరోదన నాకేమియు అర్థము కావటములేదు. మీమొగములు మీరు రాజద్రోహముజేసిన వారివలె నున్నారు. ఏల యీవంకబొంకులు చాలించుము. మిమ్ముంటయుండిన మాకుకూడా దోషమాపాదించును.

తిక్క—ఎంత కృతఘ్నతాదోషభూయిష్ఠులై తల్లిదండ్రుల నిరాదరించి పోవుచుండిరి. భరతమాతా ఇటువంటి బిడ్డలగన్నదానవు నీవెట్లు సుఖించగలవు.

జన—ఈరాజద్రోహము కుమారులదికాదు. మాపూర్వజన్మసంచితమునకు ఫలము.

రత్నం—తల్లిదండ్రులారా అదిగో చిన్నన్న ధర్మరాజు వచ్చుచున్నాడు.

తిక్క—ఇతడైనా ఆదరణగలవాడగునా.

భర—నాపుణ్యము బాగుండిన బలుడుకూడా వచ్చుచున్నాడు.

తిక్క—ఇతడు కోశాధికారి ధనగర్వంబున మిట్టిపడువాడు యీతడు మట్టుకు తల్లిదండ్రులయెడ విశ్వాసము జూపగలవాడగును.

[ధర్మరాజు బలుడు ప్రవేశించుచుండగా]

రత్న—సీ. రత్నగర్భంబున రత్నాలుపొదిగిన
తలిదండ్రులిట్లు పేదలగుటేల
స్వర్ణపోలికలలో బ్రహ్మాదివనలచే
పెంచినవారిట్లు వెరచుటేల
గొప్పలోగిళ్లలో ద్రిప్పినవార లీవల
చెట్టుగుట్టలు పట్టుటేల
అమృతాన్నమును కడుపార బెట్టినవారు
తినుటకేలేక రాత్రింబవళ్లు
గీ. ఘోరదారుణాభీల సంక్షోభకార
జాలవాలమైన క్షుధాగ్నికీలనడుమ
కుములుటేల కటకట మీగుండెగరుగ
దేలవినరేల మొర భారతీయులార.

తిక్క—ఆ చంటివానివాక్కు నొక్కింత వినియైనపొందు.

ధర్మ—చంటివానివాక్కు నీచంకకెత్తుకొని విను.

బలు—చంటివానివాక్కా మేము వినవలసినది.

భర—నాతండ్రులారా! మేము మీ తల్లిదండ్రులన్న సంగతి మరచితిరా.

జన—నా బిడ్డలారా! మీ చిన్నాన్నతమ్ముఁడు హాలాయుధుడు రైతు రాజు ఈ భేతాళప్రభుత్వంలో చనిపోయినాఁడు తమ్ములదురవస్థ తెలియదా మీకు.

(ధర్మరాజు బలుఁడు కలిసి)

ధర్మ, బలు—తమ్ములెవరు తనుపకమ్ములు రాజద్రోహులకు చావుగాక బ్రతుకు కాయపడునా. పొందుఅడవులలో బడిబ్రతుకుచుండుడు.

(నిష్క్రమింతురు)

తిక్క—భరతమాత సిపీరకుమారుల కడుపుకోతకు సాపిష్టి కిరాతులు (చూచి) అదిగో మధుపానమత్తుఁడై భైరవుఁడు దుర్గర్వాతిశయమున చిందులు త్రొక్కుచు వచ్చుచున్నాఁడు.

రత్నం—ఈగర్వపోతులు త్రాగుబోతులై అన్నలకు మాకు మోసపాటు గలుగజేసిన ఖలులయిన నేను సహించను.

(మీదికి బోవును)

భరత—(పట్టుకొని) నాతండ్రి తొందరపడకుము.

[భైరవుఁడు తూలుచు సోలుచు ప్రవేశము]

కీర్తన

రత్నం—(తల్లిచేతులలోనుంచి తప్పించుకొని దూకుడుగా పోవును)

భైర—ఓరీ! అర్భకా! ప్రేలుచున్నావేమి. అహాహాహ నీఅన్ననుగా మీరంతా నాకొడుకులోయి. మీకు ప్రభువెవడు-నేనే. తెలుసునా అ హ హ హ నిల్చిచూడు. నేను చూచుచున్నా, చూడు నాదెబ్బ. (తూలిపడుచు) ఈతప్పు కాపాడి చూడు.

రత్న—(భైరవునిచేతిలో కత్తిలాగి పొడిచి చంపును)

జన—నాయనా! ఆగుము.

భరత—పాపము చంపకుతండ్రీ.

తిక్క—విషపురుగును చంపకుండరాకూడదు. నాతండ్రీ!

రత్న—ఈభేతాళప్రభుత్వం వినాశనానికి ఈమాదిరి జాతర్లేలవసరం.

తిక్క—యదార్థం.

జన—నాకుమారా ఇది ప్రమాదసమయం. ఇచ్చట నిలువకూడదు.

తిక్క—ఇదియునిజమే. ఎచ్చటికిపోవుదము.

భర—ఎచ్చటకు వెళ్ళినను పట్టుపడక తప్పదు. ఈదాపుననే ఉండుట కొంతమంచిది.

తిక్క—నిజమే. ఇప్పుడెచ్చటికి పరాయికాకూడదు.

రత్న—ఆచెట్టుక్రందకు పోవుదమురండి. (నిష్క్రమించును)

[మోహిని ప్రవేశము]

మోహి—ఏమిది మాభైరవుడా ఏమిటిజనవదంతి భైరవా, భైరవా, ఎంచతగిన సన్మానములేనిదే ఒంటరిగా పోవద్దని నేనెంత మొత్తుకొనుచున్నను వినకుంటివిగద. ఈ విపత్పర్వతము నీ తలపై ఎన్నడు ఎగిరిపడెరాతండ్రీ. నాతండ్రి మీఅన్న భేతాళున కీవార్త ఎపుడు తెలియునురా దగ్గరఎవరునూలేరుగదరా నాయనా గర్భదరిద్రముచే స్వదేశమువిడచి ఇచ్చటికివచ్చి సుఖముగా బ్రతుకుచుంటిమిగదాయని యువ్విళ్లూరుచుంటిమి గదరా. ఇంతలో ఈప్రళయమువచ్చి పడునని కలనైనా తలప లేదుగదరా కొడుకా ఎక్కడపడివుంటివిరా నాతండ్రీ. ఈభరత మాత బ్రహ్మరక్కసియై నిన్ను బలిగోరెనాతండ్రీ.

గీ. ఇంత ఘోరదుర్దాంతదుష్టాంతమనుజ
హంతక కృతాంతపాపిష్టిసంతతులను
కంటివాటు నాదుకడుపును గాల్చితివాటు
పాతకీ ఘాతకీ ఓసి భరతమాత ?

నీకన్న బిడ్డలపై నీకెంతతీపియో నాబిడ్డలపై నాకంత తీపియని తెలియకున్నదా పాపిష్టిరాల నావరహాలతండ్రిని ఎక్కడ నీపొట్ట పెట్టుకొంటివి దయదాల్చి నిన్నీప్రాణములతో విడచిపెట్టినందుకు నావిధి బలిమా కృతఘ్నురాల!

మ. కొడుకా నాకొడుకా మరెప్పుడిది నాకొంపన్ ప్రవేశించి నా
కడుపీమాదిరి కాల్చగల్గినదిరా కాలానలజ్వాలలన్
పుడమిన్ బ్రద్దలుజేసి ఆనెరియలన్ పూడ్చింతునో భారతీ
యుడనిన్నున్ పడద్రోసి నీజనని ఆయుర్దాయముం తీతురా.

కొడుకా నాకడుపుమంట చల్లారునట్లు కొడుకా భైరవా నీవెంట నన్నుకూడ తీసుకొనిపోక పోతివా.

[భేతాళుడు ప్రవేశము]

భేతా—అదేమితల్లీ దుఃఖించుచుంటివి.

మోహి—నాతండ్రీ.

గీ. పాపభీతిలేనట్టి యీ భారతీయ
జాతి దారుణకారణ వీతిహోత్ర
పు సుడిలోన మారణమయిపోయినాడు
రాకొడుక! నీదు తమ్ముంపు బ్రదుకగలమె.

భేతా—ఓరి! కృత్రిమాలోచనపారాయణులార! భారతీయులార ఎంతసాహసము చూపించగల్గితిరి ఆత్రిభువనాధిపతులు అడ్డగించినను నా అప్రతిహతమై ప్రచండ ప్రతాపాగ్నిహోత్రపుగుండములో మిమ్ము మారణము చేయనిదే విడతునా నా తమ్ముని నీ పొట్టబెట్టుకొన్నప్పుడు నేను మీ ముప్పదిఆరుకోట్లజనమును నా పొట్టబెట్టుకొననిదే నిద్రింతునా! ఈ భేతాళుని సమాన దుర్బలభయంకరానల ప్రభలారెనని ఉబ్బూతలూగుచుండిరిగా

విద్యానిధీ ఇంకను ముగ్గురిప్రాణములు తీతును నా తమ్ముని
ఎవరు చంపిరో చెప్పుడు.

విద్యా-- (భయమున) అయ్యా! దైవసాక్షిగా మేమే పాపమెరుగము
తమరు సెలవిచ్చుచో హంతకు లెవరైనదీ వెతకిపట్టి మీకు
నొప్పగింతును.

మోహి——అప్పగింతురా.

ధర్మ——మమ్మాటికి అప్పగించెదను.

భేతా——ఒప్పగించనిచో.

బలు——మమ్ము వురితీయుడు.

భేతా-- సరె శీఘ్రమే వెతకి ఆ హంతకుల పట్టుకొనిరండు, పొండు.

(విద్యానిధి, ధర్మరాజు, బలుడు నిష్క్రమింతురు)

భేతా——వగవకు

ఉ. రోసమునచ్చి మోమునయి రోతగ ప్రేతకళల్ జనించి, స
న్యాసులుగా మదీయచరణమ్ములు పట్టినభారతీయులీ
మోసమునున్న వారిశిరముల్ నొనిమిన్ బలిమిన్ ధరిత్రి నీ
దోసిట తర్పణంబు నిడుతున్ నొలివెచ్చని రక్తధారన్.

మోహి——అప్పుడుగాని నాకడుపుమంట చల్లారదు.

భేతా——అదిగో వచ్చుచున్నారు యీమూర్ఖులే తమ్ముని జంపినహంత
కులై యుండవచ్చును.

[భరతమాత, జనకుడు, రత్నం, తర్కశాస్త్రి, విద్యానిధి,
ధర్మరాజు, బలుడు ప్రవేశింతురు]

విద్యా——ప్రభూ! వీరలే తమసోదరులను జంపిన చెడుగులు.

ధర్మ——తమతమ్ముని పొట్టబెట్టుకొనిన ఘాతకులు.

బలు——తమసోదరుల వధియించిన హంతకులు.

భేతా—ఔరా! పాపిష్ఠినష్టజాతకులారా! నరహంతకులార! ఈప్రచండ ప్రళయకాల పాథోధి బడబాగ్నిజ్వాలభీభత్సస్వరూప రౌద్రాకృతి నుంచి తప్పించుకొనిపోగలరా? నిలుడు.

రత్నం—అయ్యా! యేల? ఈనిరర్థకనిష్కారణ శుష్కగర్జన.

భేతా—అవురా! అర్భకా! నిర్భయముగా మాట్లాడుచుంటివి. ద్వీపాంతరవాసమునుంచి యెట్లు వచ్చితి.

రత్న—అది మా సాహసము.

భేతా—ఏదీ సాహసము. ప్రభంజనా దండధరా!

[ప్రభంజనుడు దండధరుడు ప్రవేశము]

భేతా—శీఘ్రమే వీని గొంపోయి చిత్రవధ.

భర—అయ్యా! పసివానిమాటలకు తామసము తగునా!

మోహి—ఓసీ! గయ్యాళిగంపా! నా పసికూనను చంపతగునా. దీనిని కూడ గొనిపోయి వధించుడు.

భేతా—ఆరక్కసినిగూడ గొనిపొండు.

జన—ఆ పతివ్రతారత్నమున జంపిన మీకేమిలాభము.

భేతా—నిన్నుగూడ చంపమందువా.

తిక్క—అయ్యో! అదికాదు. నిరపరాధులము. కొంచెము విచారించుడు.

భేతా—ప్రభంజనా! వీరినందరిని గొనిపోయి వురితీయుడు.

రత్న—

సీ. కడగండ్లలో మోసికనిపెంచినట్టి మా
తల్లికి కాళ్లబంధాలువేసి
అల్లారుముద్దుగా అఖిలభాగ్యములిచ్చు
తండ్రికి సంకెళ్లు దయదగిల్చి

వేదోషునాదోషుగా ఘోషబుట్టిన
తమ్ముల నడిసముద్రమునబెట్టి
చల్లని ఆశీర్వచనమిచ్చి గాచెడి
కవిసార్వభౌముల కాలదన్ని

గీ. ఈనిరంకుశభేతాళదానవేశ్వ
రపరిపాలనా ఖండధురంధరత్వ
మునకు బలియిచ్చుటకు మీకుబుద్ధిపుట్టె
తీసికొనివచ్చిరా భారతీయులార
మిన్నకుండెదరేల నా యన్నలారా.

భేతాళనామధేయా సకలసామ్రాజ్యధౌరేయా నాతల్లిదండ్రులు వృద్ధులు. వారు తమ్ముని చంపినవారుకారు. ఈకవిసార్వభౌముడు. అహింసకుడు. బలహీనుడు ఇతడు హంతకుడుగాడు నేనే. నీతమ్ముని జంపినది. హంతకుడ నేనే? వారిని వదలి నన్నుగీటియుము. మీభేతాళ సామ్రాజ్యము వర్ధిల్లజేసుకొనుడు.

భర—నాతండ్రీ నాకు దిక్కెవ్వరు.

జన—నాకుమారా నావంక జూచువారెవరు.

తిక్క—నాపుత్రరత్నమా మామొర వినువారెవరు.

భేతా—ప్రభంజనా దండధరా! యీహంతకుని బంధించి వారందరిని వదలిపెట్టుడు రేపు ఈహంతకుని చిత్రవధజేయుటకు తగిన సన్నాహములు భద్రపరుచుడు. (నిష్క్రమించును)

ప్రభం—(రత్నమునకు సంకెళ్లువేసి మిగతా వారిని వదలివేసి) పొండయ్యా మీరు. ఆలస్యముజేయకుడు.

దండ—మరల మీకు పట్టిన యురి, మాకు పట్టునేమో పదండి పదండి త్వరగా.

భర—(దుఃఖమున) నా తండ్రీ (కౌగలించుకొనును)

జన—(దుఃఖమున) నా బంగారుతండ్రీ (కౌగలించుకొనును)

రత్నం—తల్లీ భరతమాతా. జాతస్యమరణం ధృవం పుట్టినవాడు చావకమానడు. పుట్టి తల్లిదండ్రుల సేవజేసి చచ్చినవాడు ధన్యుడు మీ పూజనీయమైన మీపాదరవిందముల సేవజేయుటను భగవంతుడు నాకు ఆయుర్దాయమిచ్చిన కృతార్థుడనయ్యెడివాడను. జనకా చింతింపకము. అయ్యా మీ యోపికకాలము. ఇట్టి చింతలకు వ్యర్థముజేయక ప్రపంచశాంతికై అరణ్యసీమలో తపస్సుజేయుడు. కవిసార్వభౌమా ఇంత పిచ్చివాడవేమయ్యా. సమస్తము తెలిసిన మీ వంటి కొప్పు గొప్పలిట్లు దుఃఖించుట తగునా కరుణారసమ్ము జిమ్మి వీరరసమును బుట్టించు నాటకములు నవలలు రచించి చరితార్థులుకండు మీ వంటి కవిచక్రవర్తులవలననే ఏనాటికైనా ప్రపంచశాంతి జేకూరును. చింతిల్లకుము, జననీజనకులారా మా కడగొట్టు బిడ్డపొందించు యీ కడసారి కృతజ్ఞతాపూర్వకమైన అభివందనములు గైకొనుడు. ధైర్యము విడనాడకుడు.

(భరత, జనక, తిక్క-శాస్త్రి) కొడుకా నా వరహాలతండ్రీ!

ప్రభం—ఓహో! బాగానే వుంది యీవ్యవహారము.

రత్నం—జననీజనకులారా! చింతిల్లకుడు.

(భరత, జనక, తిక్క-శాస్త్రి నిష్క్రమింతురు)

5 వ రం గ ము

[దండ, ప్రభంజనుడు ఖడ్గపాణులై రత్నమున కిరుప్రక్కల నిలువబడుదురు]

రత్నం—ఈశ్వరా జగదీశ్వరా అవ్యాజ కరుణాకటాక్షము. ఈభౌతిక దేహమందు నన్ను పడలేని అమూల్యమైన వివిధాలంకారము

లతో శోభిల్లజేయుచుండిన యీ విశ్వనికేతనమునకు పంపి నా వలన ఏమిజేయుచుంటివయ్యా నీఅపారకృపావారాన్నిధిలో నెలకొల్పబడిన నివ్యక్త ధర్మస్వర్ణ సౌధములందు దిరుగాడి అమృతాహ్నముల అనుభవించి మైమరచి యుంటినేగాని సార్థకము సంపూర్ణముగా సంకల్పశుద్ధిగా మాతృదేశారాధనన్నైన సేయక పోతినిగదా.

[రాజ్యలక్ష్మి ప్రవేశించుచూ]

న ర్త న

ఎంతటి కఠినతజూపె దురాత్ముడకట
కూలివారిపైన జాలిలేకుండిన
కలుషుడు యీనృపదైత్యుడు ||ఎంత||
కూలిరాజసార్వభౌముడఖిల
రాజశిరోభూషణుడౌట
నేటికని తెల్పని భేతాళుండవసిస్థలీ ||ఎంత||
ఎన్నికష్టములనురాని ఎవ్వరడ్డుపడినగాని
సాహసమున కూలిదొరను గావనిదిక నిదురింతునె ||ఎంత||

ప్రభంజనుడు—దండధరా ఆదెయ్యమెచ్చటిది.

దండ—దయ్యమెచ్చటరా (రాజ్యలక్ష్మి వికారరూపిణియై ప్రవేశము)

రాజ్య—దయ్యమే! నేను దయ్యమై మిమ్ముబట్టటానికి వచ్చాను. విశ్వాసఘాతకులారా! మీరీగడ్డపై నుండి కదలిపోయె అంతవరకు నేను దయ్యమైపట్టి మీకువూపిరాడనిత్తునా.

దండ—అరే! దొరసానిగారురా.

ప్రభం—అమ్మా క్షమింపుడు. నాకది ప్రభువువారిచ్చిన ఆజ్ఞ.

రాజ్య—ఇదిరాణీగారిఆజ్ఞ వదలిపొండు. లేదామీకు పుట్టగతులుండవు.

ప్రభం——వెనుకకు పోయినను గొయ్యి ముందుకు పోయిన నుయ్యి అన్న సామెతగా వున్నది మనఖర్మను.

దండ——వీరికికాదురా వురి మనయిద్దరి మెడకు జుట్టుకున్నది.

రత్నం——దేవీ రాజ్యలక్ష్మి నీకు వికృతాకారమేమి.

రాజ్య——

గీ. చతురుదధి పరివేష్టిత చాతురీవ
సుంధరాచక్రమును భుజస్కంధముపై
మోయుకూలి తండ్రికి నేటికాయుతెల్ల
దీరు చిత్రవధకు మాపుమారిపోయె.

రత్నం——దేవీ చింతించక.

గీ. పడతి యీఘోరమారణపాలనా! ని
రంకుశ నృపాలభేతాళరాజ్యనాశ
నమ్మున కిలపై నావంటి తమ్ములెంద
రింక బలికావలయునో సహించగలవే.

రాక్ష——అదిగో భేతాళుడు వస్తూన్నాడు.

గీ. యీనిరంకుశభేతాళుడే గదా! మ
దీయవజ్రహలాయుధుదిక్కు మొక్కు
లేనివానిగాజేసినా నాప్రాణధనుడ
వైన కూలిదొరా నిన్నమాంతమిపుడు
మ్రింగ చనుదెంచుచుండె తిమింగలముగ

అక్కటా ఆడదాన నేనడ్డగలనే.

రత్నం——నాభరతరాజ్యలక్ష్మి? అపారవిద్యాసముద్రులైన అన్నలు మానసముద్రాలంకారులై అఖండ బలపరాక్రమసింహాలయిన

అన్నలు వంటి పిరికిపందలై కురుద్వతిమువంటి ధనికులైన అన్నలు చాతగాని పలిమిడిసుద్దులై ముసుగువేసుకొని మూల బడి బానిసలైనప్పుడు.

గీ. ఆడదానవై అబలవై అఖిలభార
తావనీ కోమలారామ జీవమృదుస
రోవరమృణాళనాళమై నీవటు క
టా! నిరంకుశగజముల నడ్డగొనుట?

ప్రభం—దండధరా ప్రభువురా.

దండ—ప్రభంజనా ఆదొరసానిగారిని పొమ్మనరా.

ప్రభం—అమ్మా దొరసానిగారు దొరగారొస్తున్నారు. మీకు మాట వస్తుంది మీరుపొండి.

(రత్నమున కిరుప్రక్కల ఖడ్గపాణులై నిలపడెదరు)

రాజ్య—నానాగేటిపాటి దొరను. నాకడగొట్టు కూలిదొరను. మీదొరల పొట్టనుబెట్టి నేనెచ్చటికి పోదును? యింకా యీభరత రాజ్యలక్ష్మి మీకు మీదొరలకు సహాయమైనట్టి అన్నఆహారాల్ని ముట్టనీయక కంటికి నిద్రపట్టనీయక రూపుమాపనిచె వదలిపోవునుగా?

[విద్యానిధి, ధర్మరాజు, బలుడు, మోహిని భేతాళుడు ప్రవేశింతురు]

భేతా—(కోపోద్రేకంతో)

శా. పారావారపరీత భూవలయ శుంభద్గ్రావ దంభోళియై
వీరానేకపసింహమై చెలగు ఈ భేతాళునిన్ నేడు, ధి
క్కారం బెవ్వడు సేయునో యతని మత్ఖడ్గంబుచే గూల్చి, భూ
భారం బే నుడిగింతువాడు పసిపాపండైన నూకొందునే.

రాజ్య—(ఎదురుగా బోయి) ప్రభూ! పతిభిక్ష పెట్టి యీ దీనురాలి కాపాడుము.

భేతా—పతిభిక్ష గాదు నీకు దుర్గతిభిక్ష పెట్టెదను. దండధరా దాని నావల నీడ్చుకొనిపొమ్ము.

దండ—పదవమ్మా దొరసాని (రాజ్యలక్ష్మిని గొనిపోవుచున్నప్పుడు)

రాజ్య—(రత్నమునకు నమస్కరించి) నాథా! నాకూలిదొరా నీదాసురాలికి సెలవిమ్ము.

రత్నం—సౌభాగ్యవతీ! దుఃఖింపకుము నాభరతమాతను, నాజనక రాజసార్వభౌముని మఱచి యుండకుము పొమ్ము. కష్టసుఖములు శాశ్వతములు గావు.

భేతా—దండధరా ఏమది తీసుకొనిపొమ్ము.

దండ—పదవమ్మా (రాజ్యలక్ష్మిం గొని నిష్క్రమించుచు)

భేతా—విద్యానిధీ వధగానింతమా.

విద్యా—చిత్తము.

భేతా—ధర్మరాజా ఇటువంటి రాజద్రోహులు దయగాల్పవచ్చునా.

ధర్మ—ముమ్మాటికి దయగాల్పరాదు.

భేతా—బలా వీనిని పాపమనవచ్చునా.

బలు—పాప మేమిటి ఇటువంటి రాజద్రోహులను పాపమనుట మహాపాతకము.

భేతా—తల్లీ, భేతాళసామ్రాజ్య కల్పవల్లీ ఇదిగో నా తమ్ముని పొట్ట బెట్టుకొన్న యీ దుష్టుని ఖండించి నీ కడుపు చల్లార్చెదను (ఖడ్గమెత్తును)

మోహి—నా తండ్రీ నా కడుపుమంట చల్లారును.

రత్నం—అన్నా అసమాన విద్యానిధీ అన్నా ధర్మరాజాగ్రణీ అన్నా ధన బలా. కడ కీవె మీా కనేక నమస్కారములు మన తలిదండ్రుల కున్నటువంటి దుఃఖరణమెట్లు మారునో తెలసికొనుడు. వారికి నాకడసారి నమస్కారము లందజేయుడు. దీనదయాళూ అపార ప్రేమాంబుధీ నాశతవృద్ధులైన తలిదండ్రుల కాపాడుము. అది యేనా తుదిసారి ప్రార్థన.

భేతా—(క్రోధోద్రేకము) నరహంతకా నీకిదియే తుదిశిక్ష (దూకుడుగా బోయి రత్నమును బడద్రోసి నరికి ఖండలు విరజిమ్మచు భీకరముగా)

యీభేతాళ సామ్రాట్టు శాసనోల్లంఘనము సేసినవారి కెల్లా యీచిత్రవధ తప్పదు. ఇది నాశపథము.

(అందరు నిష్క్రమింతురు)

అప్పుడు భూనభోంతరాళాలు పిక్కటిల్లునట్లు విషాదధ్వను లతో వాద్యములు వాయించవలయు)

[భరతమాతా జనకుడు ప్రవేశము]

భరత—(దుఃఖముతో) నావరహాల తండ్రీ కూలి ద్వారా యెక్క డున్నావురా.

జనకు—నారతనాలబొజ్జా కూలిద్వారా యెక్కడికి పోతివిరా.

భరత—నాథా నాకూలిరత్న మెక్కడ.

జనకు—ప్రేయసీ! మనకూలిపాపణ్ణి కూడా యీనిరంకుశ భేతాళుడు పొట్ట బెట్టుకున్నాడేమో.

భరత—

సీ. బక్కచిక్కిన పిక్కబలిమి తెక్కబలిమి
బ్రాొరన్నలకు ధారఁబోయువాఁడు

ముదుతలువడు తొక్కి తమముచుఁగలవారి
బొక్కసములనెల్ల పూడ్చువాఁడు
తాతిఅప్పను మ్రింగి నిల్చుకొని డే
గలకంట గువ్వగాఁ బడినవాఁడు
రైతు రాజాగ్రణి రతనాలకోటలో
కోడిపుంజుగతిర్గు కూలిబిడ్డ
గీ. డకటకట ! బలియూయెనే అసురభీక
రమృగభేతాళపాతాళ రాజ్యమందు
కూలిపాపఁడు బలియైన గూడనింక
బ్రదికియుంటిమి జీవచ్ఛవాలవోలె.

జనకు—దేవీ ! (దుఃఖమున) ఈరుధిరప్రవాహ మెచ్చటిది ?

భరత—నాథా ! నాకూలిరత్నమును ఈకిరాతకులు వంచించిరా ఆశిర స్సెవరిది. (దగ్గరకు పోయి చూచి) నాతనయుడే, నాకూలి రత్నమా! నాచిన్నయా! నానగుమోములయ్యా. (పడిపోవును)

జన—ఎంతఘోరము! ఎంత పరంతపాపభూయిష్ఠులు! వృద్ధులకన్నీరు లోకమునకు క్షేమమా ! క్షామముగాని (దుఃఖమున) నాకూలి తండ్రీ ! నాకార్మికరత్నమా ! నిన్ను చంపుకొని జీవచ్ఛవములై యున్న యీతలిదండ్రు లెంతపాపులోగదా ! నాకూలిదొరా! నీవుకూడ నాగేటిపోటుదగ్గరకు పోతివా ! నాతండ్రీ !

[తిక్కశాస్త్రి మహాజనముతో ప్రవేశము]

తిక్క—

కీర్తన

భేతాళ సామ్రాజ్య విధ్వంసమునకు
బాలభారత వీరశూరాభిమన్యుల్

ప్రతియింటిలో బుట్టి వర్ధిల్లవలయు
భేతాళసామ్రాజ్య విధ్వంసమునకు.

ఈ నెత్తుటికాలువ నా కూలిసంఘంలోనుంచి ప్రసరించినదాయేమి? (చూచి దుఃఖమున) నా కూలిరత్నము తిరిగి రక్తప్రవాహమై యీ నిరంకుశభోగలాలసుల సుఖజీవనాధార పరుసూలములకు దప్పికదీర్చుచున్నాడు, నానాగోటిపాలుచేయగ నాకూలిరత్నము యీ నిరంకుశ భేతాళప్రభుత్వంలో మూల్గియై బలియైన సంగతి నేటికైనను తెలియుచున్నదా, సోదరులారా! భారతజాతీ పుత్రులారా! యిది ప్రశాంత సమయముకాదు. ఇట్టి పాషాణ మన కెందరో తమ్ముడైన కూలి రత్నం తునియతునియలయినాడు చూచుచు దేశమాత కంటికి మింటికి నేకధారగా నశ్రువులగాడ్చుచున్నది. మన మందర మామె పుత్రులము మనకు యిచ్చదశ ఆమె కటాక్షవీక్షణములచేతనే ఆమె దుఃఖోపశమనము మన విధి ఆమె అశ్రుధారల నరికట్టుటకు మనము రక్తధారుల కార్చుటకైనను వెనుదీయకూడదు. కలకాలము బానిసలమై జీవచ్ఛవంబుల మాదిరి యీ భేతాళప్రభుత్వపాదరక్షల ప్రహారణములు తగిలిపడియుండుటకంటె చచ్చి వీరస్వర్గమనుభవించుట మేలు, జీవించితిమా స్వాతంత్ర జీవనము ప్రమందితిమా వీరస్వర్గము కవిసార్వభౌములార, పండిత వేదండములార, మేము అద్వితీయ ప్రతిభా సంపత్తులను యీ సమయములో పుష్పమకరందము నాస్వాదించు సోమరితుమ్మెదలమీాదనే వృథా చేయకుడు. ఈసమయము భట్రాజుకవిత్వమునకును, సమయముకాదు. దేశమందంతటను ఈకవిత్వములే తాండవించుచున్నవి. దేశబానిసత్వమును పటాపంచలుచేయగల వ్రాతలే వ్రాతలు, దేశబానిసత్వమునకై పాడబడు గేయములే గేయములు, దేశబానిసత్వ విధ్వంసమునకై ఆడబడు సినిమాలే సినిమాలు, దేశబానిసత్వ విచ్ఛేదనమునకై నటించే నటులే

నటరాజులు, మనదేశ బానిసత్వకళంకమును తుడిచివేయగల వీరులే వీరులు. దేశబానిసత్వమును నిర్మూలింపగల విద్యలే విద్యలు. వీర రస ప్రధానరచనలకే యిది సమయము. ఓ అభావకవులారా! యీకూలి రాజును పుణ్యారక్తస్రవంతిలో స్నానముచేయించు.

### కీర్తన

తల్లులందరు సిరిగంధములు దీసి
సిరిపూజలు చేసి స్పృహ తప్పియున్న
భరతమాతను లేపి ధైర్యంబు గొల్పి
జయభేరితో జగతి కన్పించునట్లు.

(తెరపడును)

శ్రీ శ్రీ శ్రీ శ్రీ



## సవరణపట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | సవరణ. |
|---|---|---|---|
| 4 | 12 | శృంగార | సుస్నిగ్ధ |
| 16 | 4 | తేదండి | తేరండి |
| 17 | 16 | మీరేమి | మీపేరేమి |
| 26 | 5 | తనయులెల్ల | తనయులుండ |
| 29 | 7 | దుస్స్వప్నాలు | దుస్స్వప్నాలురోజూ |
| 33 | 23 | హాళక్క | హాుళక్క |
| 37 | 12 | | ఛేతా :— |
| .. | .. | ముప్నె | మున్నె |
| 40 | 4 | పట్టుబడులు | పెట్టుబడులు |
| .. | 7 | రైతులును | రైతులు |
| .. | 10 | ఏలివారి | ఏలినవారి |
| 48 | 7 | పొగతీయ | పొగరుతీయ |
| 50 | 19 | దెచ్చునుగా | దెచ్చెనుగా |
| 56 | 11 | భరతవర్షము | భరతవర్షమునెల్ల |
| 60 | 2 | సంస్థాపించుటే | సంస్థాపించుటే |
| .. | 5 | లెట్టించు | పెట్టించు |
| 61 | 2 | శ్రీవంత | శ్రీమంత |
| .. | 25 | ఛీరు | భీరు |
| 64 | 13 | మూ | మీ |
| 68 | 9 | పిచ్చిదాని | పిచ్చివాని |
| 70 | 14 | వచ్చినా | వచ్చి |
| 72 | 16 | పుట్టలేదు | పుట్టుటలేదు |
| .. | 19 | చుండిస | చుండిస |
| 83 | 8 | కొమిలి | కుమిలి |
| 87 | 7 | రళతఘ్నుల్ | రకృతఘ్నుల్ |
| .. | 8 | నాయన | నాయనా |
| .. | 10 | నాలవ | నాల్గవ |
| 97 | 8 | కాయులెల్ల | కాయువెల్ల |
| 98 | 1 | వంటి | వట్టి |
| 102 | 18 | మేము | మీరుమూ |